శ్రీ రామాయనమః

# సావిత్రి చరిత్రము



విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

## వాసుదాస స్వామి



శ్రీరామ

# ఆర్యచరిత్ర రత్నావళి

# సావిత్రీ చరిత్రము

వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీకోదండ రామ సేవక ధర్మసమాజము,
శ్రీరామసేవా కుటీరము - ఒంటిమిట్ట,
కడప జిల్లా.

## విషయసూచిక





ఆపదా మపహర్తారం

దాతారం సర్వసంపదామ్



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్

కం. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నునితాం
తాపార భూపదయయును
దపసమందార నాకు దయసేయఁగదే.



శ్రీ పద్మావతీదేవి





శ్రీరామచంద్రాయనమః

# ఆర్యచరిత్ర రత్నావళి

నాలుగవ రత్నము

# సావిత్రీచరిత్రము

పూర్వము పాండవులు వనవాసము చేయుచుండ మార్కండేయుఁడనుమహాముని వారియొద్దకు వచ్చెను. అప్పుడు పాండవులందు జ్యేష్ఠుఁడగు ధర్మరాజు శాస్త్రమున చెప్పిన చొప్పున ఆయనకు అర్ఘ్యము పాద్యము నిచ్చి సత్కరించి కుశల ప్రశ్నానంతరము తాము దాయాదులచే పడిన పాటుల నెల్ల ఉగ్గడించి యిట్లనియె. మునీంద్రా! రాజ్యమును కోలుపోయితిమని కాని, వనములందు కష్టమనుభవింప వలసి వచ్చెఁగదా యని కాని నేను దుఃఖింపను. అబలయు, సుకుమారియు, రాజకుమారియు నైన యీ ద్రౌపది మాకై యిన్ని కష్టము లనుభవింపవలసి వచ్చెఁగదా యని విషాదపడుచున్నాను. ఈ సాధ్వివలననే కదా మేము దాస్యము నుండి విడివడితిమి. అంతియగాక యీ వనములందును క్లేశములనుండి యీ సుచరిత్రవలననే తరించుచున్నాము.

ఇట్లు పెనిమిటులను ఆపదలనుండి రక్షించిన పుణ్యశీలిని మఱియెవ్వతె యైన లోకమునఁ గలదా? యని యడిగిన మార్కండేయుఁ డిట్లనియె.

ధర్మరాజా! మహాపుణ్యాత్ములయిన పురుషులయు మహాతపస్సంపన్నులయని మునీశ్వరులయు మాహాత్మ్య మిట్టిది యని చెప్పవచ్చును గాని పతివ్రతల మాహాత్మ్యమిట్టిదని వర్ణింపఁ దరము గాదు. దానములచేతను, తపముల చేతను, ధర్మముల చేతను, మానవులకును దేవతలకును సాధ్యము కాని కార్యములు అబలలు తమ పాతివ్రత్యము చేతనే చేయఁ గలుగుదురు. దీని కొక్క దృష్టాంతము చెప్పెదను వినుము.

నేను తొలు అల్పాయుస్సు కలవాఁడనై పుట్టియుట్టిదట్టిదనరాని గొప్ప తపస్సు చేయుచుంటిని. ఇట్లుండ పదునాఱవయేఁట నేను శివపూజ చేయుచుండు సమయమున యముఁడు నన్ను కొనిపోవ వచ్చి నాపై పాశము వైచెను. నేను ఆయన పాశము నుండి తప్పించుకొనలేక భయపడి శివలింగమును

కౌగిలించుకొంటిని. యముఁడు ఆలోచన లేనివాఁడై లింగము మీఁదను నామీఁదను కూడ పాశము వైచెను. అప్పుడు లింగమునుండి రుద్రుఁడు శూలహస్తుఁడై వెలువడి యముని తన్ని నన్ను విడిపించెను. ఈ విధముగ ఈశ్వర కృపచే చావు దప్పి బ్రతికితిని గాని నా శక్తి సామర్థ్యముల చేతఁ గాదు. ఇది లోకమున కంతయు తెలిసిన విషయమే కదా. ఇఁక నొక రాచకన్నె పుట్టినది మొదలు సుకుమారియై ఆటలపాటల కాలము పుచ్చుచు నుండినది వివాహమైన యొక సంవత్సరమునకు భర్త మరణింపఁగా యముని మెప్పించి తన పతిని బ్రతికించుకొనెను. ఒక సంవత్సర కాలములో ఆ చిన్నది యెంత మహిమము సంపాదించెనో కంటివా? అనిన మునీశ్వరా! నా కా పతివ్రత చరిత్రము విన కుతూహల మగుచున్నది. వినిపింపుమా యని వేఁడిన మార్కండేయుఁ డిట్లు వక్కాణింపఁ దొడఁగెను.

అశ్వపతి యను నృపాలుఁడు మద్రదేశమును పరిపాలించుచుండెను. ఆయన పరమ ధార్మికుఁడు, బ్రహ్మణ్యుఁడు, మహాత్ముఁడు, సత్యసంధుఁడు, జితేంద్రియుఃడు, అనేక యజ్ఞములు చేసినవాఁడు, దానపతి యని పేరొందినవాఁడు, ఎట్టి కార్యమందును దక్షుఁడు, పౌర జానపద ప్రియుఁడు, సర్వభూత హితరతుఁడు, మిక్కిలి యోర్పుగలవాఁడు. ఇట్లుండియు సంతానము లేని చింతచే చాలఁగాలము తపించి తుదకు తీవ్రనియమము వహించి బ్రహ్మచారియై జితేంద్రియుఁడై దినమున కొకసారి రెండు రెండున్నర గంట వేళకు మితముగ భుజించి లక్షమార్లు సావిత్రీ ఋక్కుల చేత సావిత్రీదేవినిఁ గూర్చి హెూమము చేయుచు నిట్లు పదునెనిమిది సంవత్సరములు గడపెను.

రుక్మిణి : అప్పా! లక్ష్మీదేవి, పార్వతీదేవి, సరస్వతీదేవి, అనగా విన్నాను. సావిత్రీ దేవి యెవ్వరు?

తండ్రి : భగవంతుడు తన తేజస్సు నందలి యల్పభాగము చేతనే యీ ప్రపంచము నంతయు సృష్టించును. రక్షించును. లయము నొందించును. సంధ్య వార్చునపుడు ఈ దివ్యతేజస్సే ధ్యానింపఁబడును. ఈ తేజస్సునే ఉదయమున గాయత్రియని, మధ్యాహ్నమున సావిత్రియని, సాయంకాలమున సరస్వతి యని, ద్విజులు ధ్యానించి జపించి యాకర్షించి దీర్ఘాయువు, ఆరోగ్యము, బలము గలిగి సుఖింతురు.





ఈ విధముగా ఆ రాజు పదునెనిమిది సంవత్సరములు సావిత్రీదేవినిగూర్చిహెూమము చేయఁగాపదునెనిమిదవ సంవత్సరము కడపట ఆ మహాదేవి ఆకారముతోఁ గూడినదై అగ్ని హెూత్రమునుండి సంతోషముచే వికాసము నొందిన మువెూఁ దామరతోబయలుదేరి వచ్చి రాజును చూచిఇట్లనెను. "నృపాలా! నీ భక్తికి శ్రద్ధకు, యమ నియమములకు, బ్రహ్మచర్యమునకు తుష్టి చెందితిని. ధర్మమందు ప్రమాదపడక యేమి కోరెదవో కోరుము" అనెను. ఆ మాటలు విని "దేవీ! నేను ధర్మార్థముగానే కోరుచున్నాను. పుత్రులు లేకున్న పుట్టగతులు లేవు. సంతానమే పరమ ధర్మమని పెద్దలు వచింతురు. కావున నాకుకుల ముద్ధరించు కొడుకులు పెక్కురుపుట్ట వరమిమ్ము" అని హస్తములు జోడించి వేఁడుకొనెను.

అతని వాక్యములు విని సావిత్రీదేవి "భూపతీ! నీకొక కూఁతురు పుట్టఁగలదు" అనెను. రాజు మిక్కిలి విషాదము నొందినవాఁడై "తల్లీ!నేను కొడుకుల కొఱకై తపించితిని కొడుకు మేలుగాకకూఁతురేల? ఆనందకందమగు నందుఁ డెక్కడ? దుఃఖమందమగు కూఁతురెక్కడ? కావున నాయందు దయయుంచి పుత్రు ననుగ్రహింపుము" అని సాఁగిలబడి మ్రొక్కెను. సావిత్రీదేవియును అతని లెమ్మని చెప్పి "భూపాలా! నీలోని కోరిక నేను మున్నె యెఱిఁగి యీవిషయమై బ్రహ్మదేవుని ప్రశ్నించితిని. ఇప్పటి కొక పుత్రికను మాత్రమను గ్రమింపుము అని ఆయన చెప్పెను. కావున తేజోవతి యగుకూఁతురు నీకు శీఘ్రకాలమందే కలుగును. ప్రతిభాషింపకుము. ఇది బ్రహ్మ నియోగము దాఁటరానిది" అని చెప్పి యంతర్హిత యయ్యెను.

రుక్మిణి : కొందఱు బిడ్డలు బిడ్డలు అని కలవరించి నోములు నోఁచి వ్రతములు చలిపి, యాత్రలు చేసి బాధపడెదరే యేల? బిడ్డలు లేకుండిన నష్టమేమి?

తండ్రి : ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము నీవు పెద్దదాన వైనపుడునీకే తెలియఁగలదు. అయినను బిడ్డలు లేరని లోకులు విచారపడుటకు, సుతులు లేనివారికి గతులు లేవని శాస్త్రములు చెప్పుటకు కారణములు ఇప్పటికి మీ రెంత మాత్రము గ్రహింపఁగలరో అంతమాత్రము తెలిపెదను. స్త్రీలును పురుషులును అందఱు తాముముసలివారయి కూడ జీవింతుమని తలంచుచుందురు గాని యౌవన దశయందే మరణింతుమని తలంపరు.

అట్లు ముసలివారైనపుడు యౌవన మందు వారికుండిన జవసత్త్వము లుండవు. గనుక తమ్ము విచారించి సుఖముగ రక్షించువా రుండవలయు నని వారు కోరుచుందురు. తమ కడుపునఁ బుట్టి తాము రక్షింపఁగా పెరిఁగి తమ ద్రవ్యము తినువారి కంటె నితరులు తమ్ము ప్రీతితో చూతురా? చూడరు గనుక బిడ్డలు కావలయునని లోకులు కోరుచుందురు. ముసలితనపు మాట యటుండ బిడ్డలను లాలించుచు బేలించుచు, నవ్వించుచు, వారి జిలిబిలి పలుకులు విని వారి పిల్ల చేష్టలుకనివారితోపాటు తామును ఆడుచు పాడుచు మనుష్యులు సంతోషింతురు. సంసార మందింతకంటెను నిర్మలమగు నానంద మిచ్చునది మఱియేదియు లేదు. కావున లోకు లిట్టి ఆనందమును గోరుట న్యాయ్యమేకదా? సుతులు లేకుండిన గతులు లేవనుటకు కారణము చెప్పెదను. పూర్వజన్మముల మనము చేసిన పుణ్యమును పాపమును అనుభవించుటకే మరల భూమి మీద జన్మించుచున్నాను. ఈ జన్మమందు మరల పుణ్యము గాని పాపము గాని చేయక పూర్వ జన్మములందు చేసినవాని నన్నింటిని దైవభక్తిచేతఁగాని, జ్ఞానము చేతఁగాని కర్మముచేతఁగాని మొదలు ముట్ట నశింపఁ జేయక మనము మోక్షమును పొందఁజాలము. ఇట్లు చేయుటకు అందఱకు సాధ్య మగునా? కాదు. కాఁబట్టి తాను తన పూర్వ పుణ్యపాపములను క్షయింపఁ జేయఁగా మిగిలిన దానినితనకుఁగాను తన యంతటివాఁడు, తనయందు ప్రీతిగలవాఁడు క్షయింపఁ జేసిన తాను నరకాది బాధ లేక సుఖపడ వచ్చునని ప్రతిమనుష్యునకు తోఁచుట స్వభావమే కదా. నీవు ఒకరియొద్ద పదిరూపాయలు అప్పు తీసితివనుకో. నీవు కొంత చెల్లించి కొంత చెల్లింప లేక పోయితివనుకో. అప్పు ఇచ్చినవాఁడు నిన్ను బాధింపఁగా మఱియెవరైన వచ్చి ఆ అప్పు తీర్చి ఆ బాధ నుండి నిన్ను తొలఁగించిన నీ వెంత సంతోషింతువు. ఆ ప్రకారమే ప్రతి మనుష్యుఁడు భూమిమీఁద పుటుట్నపుడే అప్పులతో పుట్టుచున్నాఁడు. దేవ ఋణము, పితృఋణము, ఋషి ఋణము లోనైనవి తీర్పక తాను గడ తేఱలేఁడు వీని యందు తాను తీర్పఁగా మిగిలినవి తనపుత్రుఁడు తీర్చెనేని తాను కడతేఱును. తాను మరణించిన పిమ్మట పుత్రుఁడు తర్పణములు శ్రాద్ధములు శ్రద్ధతో





సలిపెనేని పరలోకమందు తనకు సుఖము గలుగును. అట్లు శ్రాద్ధములు ప్రీతితోను శ్రద్ధ తోను పెట్టుదారు లేకున్న పరలోక మందు దుఃఖములు తొలఁగవు. కాఁబట్టి సుతులు లేకుండిన గతులు లేవు. కావుననే శాస్త్రములందు

ఆ. బ్రతికియుండఁ బనుచు పలుకులు పాటించి,
యాబ్దికముల మిగుల నన్న దాన
మొనరఁ జేసి, పిండమును గయ నిడువాఁడు
పుత్రుఁ డనెడి పేరుపొందఁగలుగు.

అని చెప్పఁబడినది.

అమ్మణ్ణి : కూఁతురేల కొడుకే కావలయునని రాజనెనే కూఁతురు తక్కువేమి? కొడు కెక్కువేమి?

రాముఁడే : కొడుకొ మగవాఁడు కాఁబట్టి యెక్కువ.

తండ్రి : గుణవంతురా లగునేని కొడుకు కంటె కూఁతురు పదంతలెక్కువ యని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టి కూఁతురు చెడిపెయాయెనా యది పుట్టినింటివారిని అత్తయింటివారిని అపకీర్తిలో ముంచి వర్ణసంకరము కలిగించి తాను చెడి తన మగని వంశమునచెఱిచి గొప్పకీడు కలిగించుచున్నది. కాఁబట్టి కదా కూఁతురు పుట్టఁగానే యొక బిరుదు తెగ గోయుమని సామెత. కూఁతురు పుట్టినది మొదలు తల్లిదండ్రులు అనేక విచారములకు పాలుపడుచుందురు. దీనికి మగఁ డెవ్వఁడగునో? దీని మగఁడు దుష్టుఁడైన నిది యెన్ని కష్టము లనుభవింపవలసి వచ్చునో అల్లుఁడని పేరు రాఁగానే యెట్టి యధమునకును బిగువెక్కువ యగును. వాఁడు గుణహీనుఁడుగ నగునేని బదులు చెప్పుటకును లేక వానిచే దీనికై యెన్ని నీచపు మాటలు పడవలయునో. ఇది దుష్టురాలై మన వంశమున కపకీర్తి మనకుపాపము మెడఁగట్టునో యని యీ విధముగ నాలోచించుచుందురు. కూఁతురు గుణవంతురా లాయెనా కీర్తి కలుగును. దౌహిత్రుల వలన పరలోక సుఖమున కలుగును.

కొడుకు నాకొడుకు కోడలు వచ్చువఱకు

కూఁతురు నాకూఁతురు ప్రాణముండువఱకు

అన్నట్లు కొడుకులకు తల్లిదండ్రులయందలి ప్రీతి భార్య రాఁగానే తొలఁగినఁ దొలఁగును గాని కూతుఃరు తల్లిదండ్రులయందు అందు ముఖ్యముగ తల్లిమీఁద ప్రీతిపాయదు. తల్లి చచ్చిన తండ్రి, పినతండ్రి యను సామెత అసత్యము గాదు. కూఁతురెప్పటికైన పరుల సొత్తు గనుకను, తన భారమును వహింపఁజాలదు. గనుకను అది కొడుకును గనినఁగాని తనకు గతులు లేకపోవుటచేతను తండ్రి కొడుకునేకోరును.

రుక్మిణి : నీకు బిడ్డలు లేరే నీకు పుణ్యగతులు లేవా?

తండ్రి : దీనికిఁ బ్రత్యుత్తరము తరువాతఁ జెప్పెదను.

అమ్మణ్ణి : మనుష్యుడు భూమిమీఁద పుట్టిన తరువాతఁగదా అప్పుచేయును? అప్పులతోనే యెట్లు పుట్టును?

తండ్రి : రెండు మూఁడు దినముల తరువాత దీనికిప్రత్యుత్తరము చెప్పెదను. ఇఁకఁ గొన్ని సంగతులు చెప్పినఁగాని నా ప్రత్యుత్తరము మీకు బోధపడదు.

తరువాతి కథవినుఁడు. సావిత్రీదేవి వరమిచ్చి పోఁగానే రాజు తన నగరమునకు వచ్చి వృత్తాంత మంతయు తన భార్యకు చెప్పి సుఖముగా నుండెను. శీఘ్రకాలము నందే మాళవియను ఆయన భార్య గర్భము వహించి యొక పుణ్యదినమున నొక పుత్రికను ప్రసవించెను. అశ్వపతియును మహానందముతో పురుడిండి జాతకర్మము నామకరణము లోనగునవి కావించి సావిత్రీమంత్రము జపించుటచే సావిత్రీదేవి వరమువలన జనించినది కావున ఆ శిశువు నకు సావిత్రి యని పేరు పెట్టెను. తల్లిదండ్రులు మిక్కిలి గారాబముతో పెంప దాదుల చేతులమీఁదనే శుక్లపక్ష చంద్రబింబమువలె క్రమక్రమముగ పెరిఁగి వివాహమునకుఁ దగిన వయస్సు గలదాయెను. ఆకాలమందు అంతటి రూపవతి, గుణవతి, మతిమతి దేశమునందు లేకుండినను ఒక రాజకుమారుఁడైన ఆమెను వివాహ మాడ నిచ్చగించినవాఁడు కాడు. ఆమె సౌందర్యము గుణాతిశయము విని వివాహమాడ వలయునను కొండంత యాశతో ఉవ్విళ్లూరు మనస్సుతో రాజకుమారు లాపురమునకు వచ్చి ఆమె తేజమును చూచి నిరుత్సాహులై పోవుచుండిరి. ఇట్లు కొంతకాలము జరగఁగా





నొకనాఁడు అశ్వపతి సావిత్రిని తనయొద్దకు పిలిపించి యొడిలో కూర్చుండఁ బెట్టుకొని యిట్లనియె.

"అమ్మా! నీయందమునందును, చందమునందును, సుగుణబృందము నందును నొక్కకందుగాని కుందుగాని లేదు. అట్లున్నను ఒకరాజకుమారుఁడైన నిన్ను వివాహమాడ నిచ్చగించినవాఁడు లేఁడు. నీ దివ్యతేజస్సు చూచి రాచకొడుకు లందఱు నీవు దేవతా స్త్రీవనియు నీకుఁ దాము తగమనియుఁ దలఁచి పోవుచున్నారని వింటిని. నీకా పరిణయ కాలము సమీపించినది. ఎన్నిదినములు జరిగినను కర్యక నొకనికి నియ్యవలయునే కదా? ఎవని కని యిత్తును?

క. సుతకు వివాహ మొనర్పని
పితయును, ఋతువేళఁ దనదు ప్రియఁగూడనియా
పతియును, దండ్రిచన౽ హిత
గతిఁ దల్లిని బ్రోవనట్టి కఠినుఁడు నింద్యుల్.

అనునట్లు నీకు వివాహము చేయకుండుట దోషమని యెఱుంగుదు.

తే. "రూపగుణశీలముల ననురూఁపుడైన
వరున కీక కన్నియఁ దనవలచినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ
తాతనూభవ! బ్రహ్మహత్యాసమంబు" భారతము

అనియుండుటచేఁ దగిన వరున కీయక అల్పున కిచ్చితినా నాకు బ్రహ్మహత్య వచ్చును. కులమువా రొక్కరును నిన్నుఁ గోరరైరి. యేమి చేయుదును? రాజ్యాధిపతులు కానట్టి యుత్తమ క్షత్రియ కుమారులెందైన నున్నారేమో విచారింపవలయును. నేనొక్కమాట చెప్పెదను. వినుము. కన్యకకుఁ దగిన వరుని విచారించి వివాహము చేయవలసిన భారము తల్లిదండ్రులందే యున్నదని యెఱుఁగుదును. కులముగుణము గలిగి నీకు తగినవారు నాకు గోచరింపలేదు. కావున నాభారము నీయందే యుంచుచున్నాను. నీవు తీర్థయాత్ర నెపమున దేశాటనము చేసియందందుఁగల యుత్తమ క్షత్రియులను సద్గుణవంతులను విచారించి వచ్చితివేని అందు నీవు వలచిన

వానికి నిన్నిచ్చి వివాహము చేసెదను. నీవు బుద్ధిమంతురాలవు. గుణవంతురాలవు. పుణ్యచరిత్రవు. నీవలన నీకును కులమునకును, స్త్రీజాతికిని మాకును కీర్తి వచ్చునేకాని యపకీర్తి రాఁజాలదని నాకు నమ్మకము గలదు. కేవల కామధనరూపములు, నీ మనస్సును నాకర్షింపఁజాలవని నేనెఱుఁగుదును. కావున ఈ భారము నీయందుంచితిమి. నీతోడ కావలసిన పరివారము సేన నంపెదను అని యామెను తగిన పరివారముతోడ పంపెను.

ఆమెయును వృద్ధులగు సచివులతోడ రాజఋషులుండువనములు తీర్థములు సేవించుచు అందందుండు పెద్దలకు నమస్కరించి వారి యాఃశీర్వచనములు గొనుచు తీర్థములందు యధావిధి దానములు గావించుచు తిరిగి మరల జనకునింటికి వచ్చెను. ఆమె వచ్చునప్పటికి సరిగ అశ్వపతి నారదుతోడ ముచ్చట లాడుచుండెను. ఆమెయును మంత్రుల తోడ లోనికి వచ్చి ఆయుభయుల పాదముల వ్రాలి నమస్కరించి నిలిచెను. తండ్రియు బిడ్డను చేరఁదీసి ప్రక్కన గూర్చుండఁ బెట్టుకొనెను. అప్పుడు నారదుఁ డిట్లనియె.

రాజేంద్రా! ఈ కన్యక నీ కూఁతురు గదా. ఈమెకేల యింకను వివాహము చేయకున్న వాఁడవు? ఈమె యెక్కడ నుండి వచ్చుచున్నది? ఏమి కార్యము కొఱకు ఎందు పోయి యుండెను?" అనిన రా జిట్లనియె.

చిలుక పంజరమున బంధింపఁబడుటకు దాని మధురవాక్కు లే కారణమైనట్టు ఈమె యతిలోక తేజస్సే వరప్రాప్తికి విఘ్నము కలిగించుచున్నది. కిరీటాధిపతి కాఁగలవాఁడొక రాజకుమారుఁడైన నీమెను వరింపఁ దలఁచినవాఁడు కాఁడు. కావున ఈమెగుణము తేజము నెఱిఁగిన వాఁడను కావున "అమ్మా! నీవేపోయి చూచి వరుని కోరుకొని రమ్ము. నేను వివాహము చేసెదను" అని చెప్పి తీర్థయాత్రకై పంపితిని. అందుండి యిప్పుడే వచ్చుచున్న దని చెప్పి సావిత్రిని చూచి "తల్లీ! నీవు పోయిన కార్యము సఫలమాయెఁ గదా? ఏ రాజకుమారుని కోరితివో చెప్పుము. నారద మహామునులును విన వేడుక పడుచున్నారు" అనిన ఆ కన్యారత్న మిట్లు చెప్పెను.

"తండ్రీ! సాల్వ దేశాధిపతియు, ఉత్తమ క్షత్రియుఁడును, ధర్మాత్ముఁడును నయి ద్యుమత్సేనుఁడను ప్రఖ్యాతి వహించన పుణ్యచరిత్రుఁడు కొంతకాలము మీఁద అంధుఁడయ్యెను. ఆయన కొమారుఁడు పసిబిడ్డఁడై యుండుట చేత





పూర్వవైరులు కొందఱు దాడి వెట్టి గ్రుడ్డిరాజును బాలవత్సలయైన భార్యతోడ నూరువెడలఁ గొట్టిరి. ఆ చీఁకు రాజు ఇప్పుడు అడవియందు భార్యాపుత్రుల తోడ తపము చేయుచున్నవాఁడు. నగరమునఁ బుట్టి కాననమున పెరిఁగిన యా రాజకుమారుని భర్తగా వరించితిని" అని చెప్పినతోడనే నారదుఁడు నారాయణ నారాయణ పాపము శమించును గాక పాపము శమించును గాకయని తలవ్రాల్చి యొక్కింత సేపుండి "రాజా! తెలియక నీకూఁతురు సత్యవంతుని వరించి చేయఁగూడని కార్యము చేసెను. దానికై నేను చింతించెదను. తండ్రి సత్యము దప్పని వాఁడు తల్లియును సత్యము దప్పనిది. కావునవారి కుమారునికి సత్యవంతుఁ డని విప్రులు పేరిడిరి. ఆ కుమారుఁడు చిత్రముగ గుఱ్ఱములను చేయును. కావున నతనికి చిత్రాశ్వుఁడనియు పేరు గలదు"

అశ్వపతి : మునీంద్రా! ఆ రాచకొమరుఁడు తేజోవంతుఁడు బుద్ధిమంతుఁడు, క్షమావంతుఁడు, శూరుఁడు, పితృభక్తిగలవాఁడే కదా?

నారదుడు : తేజస్సున సూర్యునిబోలును. బుద్ధియందు బృహస్పతితో సముఁడు. ఇంద్రునివంటి వీరుఁడు. భూమివలె నోర్పు గలవాఁడు.



నారదుఁడు సత్యవంతుని గుఱించి చెప్పుట

అశ్వపతి : ఆ నృపనందునుండు దాతయును బ్రహ్మణ్యుఁడును సత్యవంతుఁడును, గును కదా? విశేషసుందరుఁడు కాకున్నను ప్రియదర్శనుఁడైన నగును గదా?

నారదుఁడు: యథాశక్తి దానమునందు సంకృతిపుత్రుఁడైన రంతిదేవునకు తుల్యుఁడు. శిబివలె సత్యవాదియు బ్రహ్మణ్యుఁడును, యయాతివలె నుదారుఁడు ప్రియదర్శనుఁడు, అశ్వనీదేవతలవలె సుందరుఁడు. అంతియగాక ఇంద్రియ నిగ్రహము గలవాఁడు. మెత్తనివాఁడు, శూరుఁడు. అసూయలేనివాఁడు. మంచి మైత్రిగలవాఁడు. హ్రీమంతుఁడు. ఆర్జవము, సత్యము, ధృతి, ఆయన యందు నిలుకడగ వసించుచున్నవి.

అశ్వపతి : దేవమునీ! కన్య నిచ్చువాఁడు వరునియం దేయేగుణములుండఁ గోరునో కులోచితమైన యన్ని సద్గుణములు సత్యవంతునియందుఁ గలవని మీరే సెలవిచ్చితిరి. ఆయనయందేదైన చెడు గుణముండిన కరుణించి తెలుపఁ గోరెదను.

నార : ఆయనయందు గుణములనన్ని మ్రింగు నొక దోషము తప్పమఱి యే దోషము లేదు. ఆ దోషము ప్రయత్నముచే చక్కఁబడునది కాదు. అతఁడు నేఁటికి సరిగ సంవత్సరమునాఁడు కాలపాశవశుఁడగును.

అశ్వ : తల్లీ సావిత్రీ! యీ దేవముని వాక్యములను వింటివి కదా. వీరు త్రికాలవేదులు. అమోఘవచనులు. వీరు చెప్పినది తప్పదు. తెలిసి తెలిసి యల్పాయు నగువాని నేల కోరెదవు? మఱి యెవ్వనినైనఁ గోరుము.

సావిత్రి : తండ్రీ ! సమస్త ధర్మవేదులును ధర్మనిష్ఠులును నగు మీరిట్లు పలుకుట న్యాయ్యమా!

అశ్వ : అమ్మా! నేనేమి అధర్మవాక్యములు పల్కితిని. ఆపద రాఁగల దను సందేహము గల విషయములందే బుద్ధిమంతులు ప్రవర్తింప రన నిఁక స్పష్టముగ కీడువచ్చు కార్యముల నెవరైనఁ జేయుదురా? లక్ష్మి చపల కావున నైశ్వర్యము శాశ్వతము కాదని తలఁచి ఆయన దరిద్రుఁడైనను నిన్నీయ నొప్పితిని. అల్లారు ముద్దుగ, అరచేతి నిమ్మపండువలె, నేలనడిచిన నీపాదము లఱిగి పోవునేమో యను భీతిచే చేతులమీఁదనే గోమున పెంచిన నిన్ను నీ యట్టి సుకుమారిని తపసి బాలునికి ధారవోసి





నీవు నారచీరలు కట్టి, జడలు ధరించి కందమూలములు దని, ఉ పవాసముల వటించి, ఎండకు గాలికి వానకు సంకటపడుచు, కడుపు చూచి కూడుపెట్టి, తలఁజూచి నీళ్లు పోయువారు లేక, ఆకుగుడిసెలలో నేలమీఁద పైఁట చెఱఁగు పానుపుగా హస్తము తలదిండుగా పండుకొనుచు, అడవిమృగములు కూఁతలకు మేలుకొనుచు కష్టింపవలసి వచ్చెఁగదా యను దుఃఖమును అతఁడు గుణవంతుఁడు విద్యావంతుఁడు కులీనుఁడు అని యెఱుఁగుటచేత శమించుకొన్నను ఒక యేఁడైన తిరుగక ముందే కుంకుమ లేనినీ మొగమును పాపట లేన నీ ముందలను చూడవలసివచ్చు నన్న దుఃఖము నెట్లు సహింపఁగలను?

సావిత్రి : నాపాపము చేతనే కదా నాకు వైధవ్య దుఃఖము రావలయును? అట్టి దుఃఖము నేననుభవింపవలసిన తలవ్రాఁత యున్నయెడల నేను కోరినవానికిఁ గాక నన్ను మీరు మఱియొకనికి నిచ్చినను వాఁడు మాత్రము నూఱేఁడులు బ్రతుకు నని యెట్లు నమ్మకము?

అశ్వ : అటులని చూచి చూచి బావిలో దుముక వచ్చునా?

సావి : ముందు బావియున్నదని తెలియని యెడల ప్రమాదమున దానియందుఁ బడినఁ బడుదుముగాని తెలిసినప్పుడు దానిని తప్పించిపోమా?

అశ్వ : అయ్యో పిచ్చిదానా! మృత్యువును తప్పించుకొన నెవరి వశమమ్మా?

సావి : మృత్యువును దప్పించుకొన జీవికి సాధ్యము కాదు గాని యిట్టి మహాత్ములు దయ తలఁచి రేని మృత్యువు నుండి తప్పింపఁ గలరు.

అశ్వ : వారు తపస్సంపన్నులు కావున తప్పింపఁగలరు.

సావిత్రి : స్త్రీలును తపస్సంపన్నులు కాఁగూడదా? అబలలపై నిట్టివారికి దయరారాదా?

అశ్వ : ఏ స్త్రీఓ యయిన నీ కేమి లాభమమ్మా? ఒక సంవత్సర కాలములో సంసార మంతయు నిర్వహించుచు నీవు తపస్సేమి చేయఁగలవు?

సావిత్రి : మునీంద్రా! స్త్రీలకు పాతివ్రత్యముకంటెను తపస్సుకలదా?

నార : లేదు.

సావి : పతివ్రతలకు పతివియోగము కలదా?

నార : లేదు.

సావి : తండ్రీ! మీమాట కెదురు చెప్పుచున్నానని కోపగింపకుఁడు ఈ బ్రమ్మపుత్రుల యనుగ్రహము మనయందుఁ గలదు. నా ప్రియుఁడు కాలపాశవశుఁడగునని మాత్రము చెప్పిరి గాని నాకు పతివియోగము కలుగునని వీరు సెలవిచ్చినవారు గారు. అంతియగాక పాపము శమించుననియు వచించిరి. వీరమోఘవచనులని మీరు సెలవిచ్చితిరి. ఇఁక నాకేమీ భయము?

అశ్వ : అనిష్టము విన్నప్పుడు శాంతము పాపము అని పెద్దలందురు. ఇంతటి కత్తిమీఁది సాము నీకేల? లోకము నందు రాజకుమారులకు కఱవా?

సావిత్రి :

క. ఒకసారి సారె వేయుట
యొకసారియె యిడితి వనుట,యొకసారియొక
న్యకనుం దానము చేయుట,
యకటా యిరుమాఱు సేయ నర్హమె వీనిన్,

క. "వినుము మనోవాక్కాయము
లన మూఁడు తెఱంగు, లందునంతఃకరణం
బనఘ! ప్రధానము, గావున
మనమునఁ గైకొన్న భర్త మానం దగునే?" భారతము.

మనోవాక్కర్మములందు మొదటిదైన మనస్సు ప్రధానము. మనస్సున తలఁపఁ బడినదే వాక్కుచే చెప్పఁబడును. అదియే చేతఁ జేయఁబడును. మనస్సున నొకటి యెంచి వాక్కున మఱొకటి చెప్పినను లేక చేసినను అట్టివారు లోకవంచకులే గాక ఆత్మవంచకులు నగుదురు. ఆత్మనే వంచించువారు చేయలేని పాపమేది యుండును? మొదట నిశ్చయించుకొనిన పతియందు నేదో దోషము నేదో దోషము కలదని వానిని విడిచి మఱియొకనిఁగోరిఁ వానియందు మఱియొక దోషము కనఁబడ వాని విడిచి మఱియొకని వలచి, వానియందు మఱియొక





దోషము దోఁప మఱియొకని వరించు కాముకికి విధివిరామములు లేక వయసు చెల్లువఱకు మగలు ప్రాప్తించుచుందురు. అది యెవతె చేయవలసిన కార్యము? మనస్సున నేను నిశ్చయించినపుడే యా రాజకుమారుఁడు నా భర్త యయ్యెను. అట్టి భర్తపైనుండు మనస్సును మఱియొకనిపై నుంచుట జారిణీ లక్షణము గాని సతీ లక్షణము గాదు. నీడయే లేని దీపము. దోషమే లేని జీవి లోకమున లభించునా? మనావతి ఆపత్సహస్రము సహించును గాని శృలమానహాని లేశమైన సహింపదను సూక్తి వినరా?

అశ్వ : కన్యాదానమున నధికారము తండ్రికి కలదు గదా. నేను కోరినవాని కిచ్చెదను. అంగీకరింపుము.

సావిత్రి: నా మనస్సు ఎవనిమీఁదను పోకముందు మీరట్లు చేసి యుండిన యెడల మీరు నియమించిన పురుషుఁడే నాభర్తయని శిరసావహించి గ్రహించి యుందును.

అనిన ఆమె దృఢనిశ్చయ మెఱిఁగి విచారపడుచున్న నృపునిఃజూచి నారదుఁడిట్లనియె.

చ. "గొనముల ప్రోక నీయనుఁగుఁగూఁతురు, దీనితలం
పుమానప్పఃగా! మనకు నశక్య మింక, ననుమాన
ములేల? నరేంద్ర! యింతిఁ జయ్యన నృపనూతి
కిమ్ము, కమలానన చేసిన పుణ్యగౌరవం! బుననయి
నం బ్రియుండు పరిపూర్ణ చిరాయురు పేతుఁడయ్యెడున్"

రాజా! నీ పుత్రిక వాక్యములు ధర్మయుక్తములు. శీలవతీ సూచకములు. శిష్టాచార సమ్మతములు. ఇట్టి దృఢనిశ్చయురాలి మనస్సు త్రిప్పు మనకు సాధ్యపడదు. ఈమె బుద్ధి చాతుర్యము, మనోనిశ్చయము, సతీత్వగౌరవబుద్ధి, చూడ నీమెకు ఏదొసఁగులు పొసఁగ వని తోఁచెడి. ఇట్టి సాధ్వికి దేవత లెన్నఁడు నపకారము చేయరు. ఇంతకు బుద్ధి విధిలిఖిత మనుసరించును. లోకము స్వకర్మ సూత్రగ్రథితము తప్పింప నసాధ్యము. నీవు సంకోచింపక సత్యవంతున కీబిడ్డ నిచ్చి వివాహము చేయుము. అనిన రాజు సంతోషించి "మునీంద్రా! మీ వాక్యములు వేదవాక్యములు. మీరు చెప్పినట్లు భగవంతునిపై భారమిడి యీ కార్య మొనర్చెద నని పలికెను. నారదుఁడు రాజుచే వీడుకోలు

వడసి యంతర్హితుఁ డయ్యెను. అశ్వపతియును కూఁతును దోడ్కొని దారబంధు పురోహితామాత్య పరిజనయుక్తుఁడై వివాహ వస్తు సంభారముల తోడ ద్యుమత్సేనుఁ డుండు కాననమునకై పోయెను.

## సావిత్రీ సత్యవంతుల వివాహము

ఇట్లు పోయి పోయి అశ్వపతి ద్యుమత్సేనుఁడు తపము చేయు వనము ప్రవేశించి దూరమునంద పరివారము నిలిపి పాదచారియై తనతోడ ద్విజులును సావిత్రియు నట్ల రాఁగా మెల్లనపోయి సాలవృక్షము నీడ దర్భాసనమునఁ గూర్చుండి పుణ్యకథా గోష్ఠినుండు చీఁకురాజును ద్యుమత్సేనుఁ జూచి నమస్కారముఁ గావించి తన్నెఱిఁగించి సావిత్రిని నమస్కరింపఁ బనిచెను. ద్యుమత్సేనుఁడును మిగుల సంతసించి అర్ఘ్యము, పాద్యము, పీఠము నర్పించి గోవు నొసఁగి కుశల ప్రశ్నానంతరము నీరాకకుఁ గారణ మేమని యడిగిన నశ్వపతి యిట్లనియె. "రాజోత్తమా! నేను మహాప్రయోజన మొకటి కల్పించి నీవలనఁ గృతార్థుఁడఁ గాఁగోరి వచ్చితి. నేను చిరకాలము సంతానము గానక తుదకు సావిత్రీదేవి యనుగ్రమమున నీ కన్యకను గంటిని. ఈమె పేరు సావిత్రి.

క. "ఈ కన్నియ నా కూఁతురు
మాకులమున కెల్లఁదెప్ప, మనుజోత్తమ! నీ
వీకన్నయఁ గోడలిఁగాఁ
గైకొనుము మదీయవచన గౌరవబుద్ధిన్"

క. "నీ కొడుకు సత్యవంతున
కీకన్నియ దగు నరేంద్ర! యీకన్నియకున్
నీ కొడుకు దగు; ననన్యగు
ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్"

అయ్యా! నీవు లోకోత్తర చరిత్రుఁడవనియు, ధర్మిష్ఠుఁడ వనియుఁ గులీనుఁడవనియు, నీతోడి బాంధవ మవశ్య కర్తవ్యమనియు నెఱుంగుదు.

క. "కయ్యమునకు నెయ్యమునకు
వియ్యమునకు సమత వలయు; వేఱొండైనన్
గయ్యము గెలువదు, నిలువదు
నెయ్యము, వియ్యంబు పొసఁగ నేరదు మొదలన్"





అనునట్లు వియ్యమునకు సమత్వము వలయును గదా. ఇఁక మాస్థితి మీకుఁ దెలియనిది కాదు.

తే. విగతరాజ్యులమై ఘోరవిపినములకు
వచ్చి యిమ్మెయిఁ దపమున్నవార మేము.
బాలసుకుమార యిది జనపాల! యడవి
నుండి మాతోడ నిడుమల కూర్చునయ్య? భారతము.

వనవాసమునందలి క్లేశములు నీ వూహింపఁజాలవా? పేదవారింటి కోటఱికము కన్యకకు పూర్వపాపఫలము గదా. అట్టితి నీపుత్రిక కేల? తలఁపవా యనిన అశ్వపతి యిట్లనియె.

కలిమిలేములు కావడికుండలు. రాత్రి తెగుదలఁ బగలును, పగటి తెగుదల రాత్రియు వచ్చునట్లు కష్టానంతరమున సుఖమును, సుఖానంతరమున దుఃఖము గలుగుట వింతకాదు. కావున,

చ. కలిమియు లేమియున్ సతముగా, వవిచెందినచోఁ
జెలంగుచున్ । గలఁగుచు నుక్కి ధీరుల ప్రకా
రమె? లెస్సగ నింతవట్టు నేఁ। దెలియదుఁ జెప్పె
దన్ వసుమతీవర! పిన్నయనంగ నేల? యీ। కొలఁ
దియుఁ గాదు, ధీరమతి గూఁతురు పేర్కొనఁజాలుఁ
బెంపునన్. భారతము.

నా పుత్రియు లోకస్థితిగతులు తెలియనిది గాదు. కులోచిత వృత్తియు శీలాసక్తియు ధర్మరక్తియుఁ గలది. వయస్సు చెల్లియు గురులఁ గొలువక జ్ఞానహీనలై, యుచితానుచితములు తెలియక స్వచ్ఛందవర్తనలైనవారు బాలలుగాని పిన్నవయస్సున నుండియు జ్ఞానవతులు ధీమతులు ధీరమతులు నగువారు బాలలు గారు. వనవాస కష్టముల కీ చిన్నది యెట్లోర్చునంటివి. కేవల కష్టమును గాని కేవల సుఖమును గాని యిచ్చునది లోకమున లేదు. ఒకవేళ సుఖమిచ్చునదే మఱియొక వేళ దుఃఖమిచ్చును. ఒకరికి సుఖమిచ్చినదే మఱియొకనికి దుఃఖమిచ్చును. గ్రహించువారి మనస్థితిని బట్టి పదార్థములు సుఖదుఃఖకరములుగఁ దోఁచును. ఈ నిశ్చయ జ్ఞానము గలవారికి

రాకపోకలుగల దేదియు సుఖ దుఃఖముల నియ్యఁ జాలదు. సహనము దానికి మందు. నా పుత్రిక కీ నిశ్చయజ్ఞానము గలదు.

క. నీతోడ వియ్యమందం
జేతోగతి నాసచేసి చెచ్చెర నిట్లే
నేతెంచితి, మత్ప్రార్థన
బ్రాఁతిగఁ జేకొనక యునికి పాడియెనీకున్? భారతము.

నెయ్యమున నీతోడ వియ్యమంద వచ్చిన నాతోడ నీవిట్లు పలుకుట ధర్మము గాదు. నా నమస్కారము గ్రహించి నా కోరిక సఫలము చేయుము. ఆశాభంగము గావింపకుము. అన్నివిధముల నీవు నా సమానుఁడవు. నేనును నీకు సముఁడను. ఇట్టి బాంధవము నీవేల యుపేక్షించెద వనిన ద్యుమత్సేనుఁడు సంతుష్టుఁడై మిత్రమా! మన చెలిమి నేను మఱచినవాఁడఁ గాను. కానక కానక నీవొక కన్యకఁ గనిన వార్త విన్ననాఁడే నీతోడ వియ్యమందఁ దలఁచితిని గాని పదపడి నాకు ప్రాప్తించిన కష్టదశ వలన నిరుత్సాహుఁడనైతిని. నీవింటికి వచ్చి బిడ్డ నిచ్చెదననిన త్రోసివేయు నంత వెఱ్ఱినిగాను. చిరకాలేప్సితము నేఁడే నెఱవేఱును గాక. కల్యాణ ప్రయత్నము గావింపుమనెను. అంతట నాపొంతలఁగల ద్విజుల నెల్ల పిలిపించి యథావిధి సావిత్రీ సత్యవంతులకు వివాహము నిర్వర్తింపించి వధూవరులకు వలసిన వస్త్రాభరణాదుల నిచ్చి అశ్వపతి తన వీటికి పోయెను. లోకమున సౌందర్యము సులభము. గుణార్జనము దుర్లభము గావున సత్యవంతుఁడును తనకు సర్వశుభగుణాన్విత యగు సుందరి లభించుటకు మిక్కిలి యానందించి యామెకు ప్రీతికరములగు కార్యములఁ జేయుచుండెను.

## సావిత్రి గురుశుశ్రూష చేయుట

సావిత్రియు తాను గోరిన మగఁడు లభించెనని సంతోషించి వినయమే సతీవ్రతమనుట మఱవక యత్తమామ మగ కేకొఱఁతయు తోఁపకుండునటులు వేళకుఁ దగినట్లు వారివారి చిత్తవృత్తు లెఱిఁగి యేపనియు చెప్పించుకొనక చేయుచుండెను. ప్రతిదినము పతికి ముందుగ నిద్దుర లేచును. నేను దొడ్డ రాచబిడ్డను గదా పేఁడ యెట్లు తాఁకుదును? దాసివలె ప్రాంచిపని యెట్లు చేయుదును? అని యేవగింపక, గర్వము లేక, మన యింటి పనులు మనకంటె





నెక్కువ శ్రద్ధతో నెవరు చేయుదురని తలఁచి యిల్లంతయు కసపూడ్చి సూర్యున కెదురుగ నిలిచి పేఁడనీళ్లు చల్లరాదు గనుక ప్రొద్దు పుట్టకముందే గోమయము తోడి కలయంపి చల్లును. శుక్రవారము మంగళవారము ఇల్లంతయు గోమయమున నలుకును. అలికి విడిచిన కడపను గాని పాడు గడపనుగాని దాఁటరాదు. కావున ధాన్యపుఁబిండితో ముగ్గులు పెట్టును. సోమరితనము చేత పాత్రములను మీఁద మాత్రము శుద్ధిచేయక వెలుపలను లోపలను చిలుముగాని పాఁచిగాని లేకుండునట్లును తాను పట్టించి రుద్దిన। మన్ను, బూడిద చింతపండు పోవునట్లును నీటితో చక్కఁగ కడుగును. గరగరలాడునట్లు వస్త్రములను తానే యుదుకును. పాడుమొగమునందు పెద్దమ్మ వ్రేలాడుచుండును గనుకను, అట్టి మొగమును చూచిన పతికి ఆయుస్సు క్షీణమగును గనుకను ప్రాతఃకాల కృత్యము లెల్లఁ దీర్చి యద్దమున చూచి ముఖమున కుంకుమఁ బిట్టు పెట్టుకొని, గురువులకు, పతికి, లోకులకు క్షేమము గలుగ దైవప్రార్థన చేసి, యత్తకు మామకు మగనికి నిద్దురలేవఁగానే కావలసిన పదార్థముల నమర్చి వారు మేల్కొనిన వెంటనే వారికి నమస్కరించి, వారు కోరిన పదార్థము లర్పించి, భర్త తెచ్చిన నివ్వరి బియ్యమును పాకము గావించి యగ్ని హోత్రాదులకు దేవతారాధనమునకు వలసిన సాయమొనరించి, యతిథుల నభ్యాగతుల నాదరించి, యత్తమామలు తమకష్టముల మఱచునట్టును పతి సంసారమే స్వర్గమని తలఁచునట్టును ప్రవర్తించుచుండెను. సాయంకాలమున మరల వాకిట నీళ్లుచల్లి ముగ్గు వేసి సంధ్యదీపము వెలిఁగించి ప్రమిదకు కుంకుమ పెట్టి దీపలక్ష్మికి నమస్కరించును గృహమునకు శ్రేయస్సునకై వీథి నడచువారి కుపకారమునకై వాకిట దీపముంచును. పతి తెచ్చిన ధాన్యము కొంచెమో గొప్పో వెంటనే రాయి యిసుక లేకుండునట్లు చెరిగి జల్లించి చక్క పఱిచి పాత్రములలో పదిలముగ దాఁచునే కాని యెచ్చటి కుప్ప లచ్చటనే యుంచి యెలుకలపాలో కొక్కులపాలో చేయదు. తనకు తన తండ్రి యిచ్చిన వస్త్రములు భూషణములు అన్నియు అత్తగారికి కట్టఁబెట్టనిచ్చి తాను కాషాయవస్త్రముల ధరించి సతికి నుచితమైన చర్యః జరించుచు పతి సుఖము తప్పసతికి వేరు సుఖము లేదు గావున ప్రియవాక్కుల వలనను స్నేమమువలనను రక్షోపచారముల వలనను వినయమువలనను ఓర్పువలనను సావిత్రిభర్తను పరితోషపెట్టుచుండెను.

అమ్మణ్ణి : బియ్యపుఁ బిండి ముగ్గునకంటె ముగ్గుఱాల పిండిగాని సున్నపు ఱాలపొడి గాని తెల్లగా నుండును. అప్పటివారికి సొగసులు తెలియవు. ధాన్యపుఁ బిండితో ముగ్గు పెట్టిన ఎంత నష్టము చూడు.

తండ్రి : తొలుత ఇల్లలుకుట యెట్టిదనఁగా నీవు పండ్లు తోముకొని ముఖము కడుగుకొనునట్టిది. ఆరోగ్యకరములై దంతములకు పటుత్వము నిచ్చు మంచి పదార్థములచే దంతములను శుద్ధి చేసికొనుని యెడల నెట్లు నోటికంపు పండ్ల పాఁచి పండ్లసందున నిఱికికొనిన పదార్థములు పోయి ఆరోగ్యము కలిగించునో యట్టులే గోమయమున నలికిన యెడల నింటిలోని గాలిని శుభ్రపఱిచి, హాని కరములైన కీటకాదులను బోఁగొట్టి ఆ యింటి యందుండువారికి ఆరోగ్యమును కలిగించును. ముఖము కడుగుకొనిన పిమ్మట నీవు ముఖము ననలంకారముగను శుభ చిహ్నముగను బొట్టు పెట్టుకొనునటులు గృహలక్ష్మిని రంగవల్లిచే నలంకరింప వలయును. లేనియెడల పాడుపెట్టిన యింటివలె శ్రాద్ధము నాఁటి వీటివలె నుండును. మన పెద్దలు పారమార్థిక మైన బుద్ధి లేక కేవలము ఐహిక బుద్ధితోనే కార్యము నేర్పాటు చేయలేదు. ధాన్యపుఁ బిండితో ముగ్గు పెట్టినయెడల నది చీమలు లోనగు అల్పపు జంతువుల కాహారమగును. అదియొక పుణ్యకార్యము కదా! బియ్యపుఁబిండిని చక్కఁగ సిద్ధము చేసిన యెడల రాతిపిండికంటె తెల్లగానే యుండును. ధాన్యపుఁబిండి ముగ్గు పెట్టిన నష్టమంటివి. మతియెంతో గతియెంతో. ఇప్పుడు నీవు బుద్ధిమంతురాలవో సావిత్రి బుద్ధిమంతురాలో నీవు ఆలోచించుకో.

రుక్మిణి : ఇల్లలుకుట, ముగ్గుపెట్టుట, చెంబులు తోముట కూడఁ జెప్పవలయునా?

అమ్మణ్ణి : రుక్మిణమ్మా! అప్ప యేలయవి చెప్పినాఁడో నాకుఁ దెలియును. అమ్మ ఒకనాఁడు నన్ను ఇల్లలుకు మనెను. పేఁడ కంపు నేను తాఁక నంటిని. అప్ప ఆ మాటలు వినుచుండెను. మహారాజు బిడ్డ యెట్లు ఇంటిపనులు చేసినదో చూడుఁడని మనకు బుద్ధి వచ్చుటకు చెప్పినాఁడు కారణము లేక అప్పఒక మాటకూడఁ జెప్పఁడులే.





## సావిత్రి త్రిరాత్రోపవాస వ్రతము సలుపుట.

ఇన్ని కార్యములు చేయుచుండియు ఆ మహాభాగ నారదువాక్యములు మఱచినది కాదు. ఒకటి రెండు అని ప్రతిదినమును ఎంచుకొనుచుండెను. ఇట్లు కొంత కొఱఁతగా సంవత్సరము గడువఁగా నిఁక నాల్వ నాఁడు భర్త మరణించునని యెఱిఁగి శ్రమము లేక మహాఫలము సిద్ధింపదని తలఁచి మూఁడు రాత్రులు శుష్కోపవాస ముందు నొక మహావ్రతము చేయ నారంభించెను. త్రయోదశినాడుఁడు ఉపవాస మారంభించి పాడ్యమినాఁడు పారణము చేయునట్టి వ్రతమును భర్త దీర్ఘాయుష్కుఁడు కావలయునని కోరు మహాపతివ్రతలు చేయుదురు. సావిత్రి యీ వ్రతమును చలువ నుపక్రమించుట యెఱిఁగి ద్యుమత్సేనుఁడు కోడలిని బిలిచి యిట్లనియె "అమ్మా! నీవు తొలుతనే సుకుమారివి. అందు వనవాసాయాసమున బడలియున్న దానవు. ఇట్టి నీవు ఘోరవ్రతము నారంభింప నేల? సుకరములగు నోములనేవైన నోఁచరాదా? యనిన సావిత్రి యిట్లనియె.

"తండ్రీ! నాకై మీకు పరితాపపడవలదు. ఈ వ్రతమును నేను తుదముట్ట సలిపెదఁగాని విఘ్నముల రానీయను.

క. మీకు మదీయంబగు వ్రత
భారమునకు వగవ వలదు; పరమశుభంబుల్
గోరి వ్రత మేను బూనితిఁ,
గారణమును మీ కెఱుంగఁగా నగుఁ బిదపన్.

అనిన ద్యుమత్సేనుం డిట్లనియె

క. పతిహితము గోరి సలిపెడి
వ్రతమును విడు మనుచుఁ జెప్పరా దటుగానన్
వ్రతమును బారం బొనరిచి
యతులిత శుభచయము లొందవమ్మా పుత్రీ.

అని యాశీర్వచనరూపమున నామె కార్యమున కనుమతించె. రేపు పతి మరణదిన మన నేఁటి రాత్రి తన నిబ్బరము నణఁచి వచ్చు శోకమునకు చిక్కియు స్థైర్యము విడువక భగవంతునియందు ధ్యానయోగమున మనము

నిలిపి యుదయము కాఁగా కృత్యముల నెల్లఁదీర్చి బారెఁడు ప్రొద్దెక్కు నప్పటికి హెూమము నిర్వర్తించి యవాశ్రమమునఁగల ద్విజులకును వృద్ధసువాసినులకును అత్తమామలకును నమస్కరించి వారు "అవైధవ్యమస్తు" వైధవ్యము లేకుండును గాక యని దీవింప తథాస్తని మనస్సున గ్రహించెను.



సావిత్రి హెూమము చేసి దైవప్రార్థన చేయు

నాలుగవనాఁడును తమకు మాత్రము భోజనము పెట్టి తాను భోజనము చేయక యేకాంతమున నున్న కోడలిని పిలిచి ద్యుమత్సేనుఁడు "అమ్మా! నీ వ్రతము సాంతమయ్యెఁ గదా. నేఁడేల యుపవసించెదవు? భోజనవేళ మించుచున్నదే" యనిన ఆమెయును "తండ్రీ! నేను వ్రతము చేయ సంకల్పించినపుడే యీ పగట భుజింపరాదని నిశ్చయించుకొంటిని. ప్రొద్దుగ్రుంకిన భుజించెదను. క్షమింపుఁ డనిన ఆయన యూరకుండెను.

## సావిత్రీ సత్యవంతులు వనమునకుఁ బోవుట

ఇట్లు సావిత్రి యత్తమామల సమాధాన పఱుచుచుండ సత్యవంతుడు బుట్టయు గొడ్డలియుఁ గైకొని ఫలమును సమిధలను గొనితేర వనమునకు ప్రమాణమయ్యెను. అప్పుడు సావిత్రి తన పెనిమిటి కెదురుగ పోయి నిలిచి యిట్లనియె. నాథా! నే నీయాశ్రమమునకు వచ్చి నేఁటి కొక సంవత్సర మయ్యెను.





ఒకనాఁడైనను మిమ్ము నెద్దియు కోరిన దానను గాను. కోరక కోరక నేఁడొక కోరిక కోర మనస్సు పుట్టెను. నన్ను చిన్న పుచ్చక నా ప్రార్థన నెఱవేర్పఁ గోరెదను.



సావిత్రి వనమునకు వచ్చెదనని భర్తను బ్రార్థించుట

అది మీకెట్టి యాయాసమునుగాని కష్టమునుగాని కలిగించునది కాదు. మాటమాత్ర మంగీకరించిన చాలును" అని సావిత్రి పలికిన సత్యవంతుఁ డిట్లనియె. అంతటి సుకరమైనకార్యమగు నేని నీ విషయమున నేను వంచనచేయుదునా? నాశక్తికి లోపడిన దేదైన నిచ్చెదను అడుగుము.

సావిత్రి : నేను తండ్రి యింట నున్నప్పుడు పుర శృంగారమును అంతఃపుర శృంగారమునే కాని వనలక్ష్మి శృంగారమెట్టిదో యెఱుఁగను. నేఁడు మీవెంట వచ్చి దానిని చూచి యానందింపవలయునని కోరిక గలిగెను. నేను మీ కెట్టిగాసియు నీయను. ఒక వస్తువైన నాకుఁ దెచ్చియిమ్మని వేఁడను. ఊరక కానన శృంగారముఁ జూచి మరల మీతోడ వచ్చెదను. ఈ బుట్టను గొడ్డలిని నేను మోసి తెచ్చెదను. మీరు సమిధలు సేకరించునంతలో నేనాదాపున నున్న పండ్లను పూవులను కోసి బుట్ట నించెదను అని యెంతో దైన్యమున ప్రార్థించిన నామెను చూచి సత్యవంతుఁడు "అబలా! నీవు చిన్నవయసు బాలవు. అందు

సుకుమారివి. అందు గృహకృత్యములచే బడలిన దానవు. అందు నాలుగు దినములుగ నిద్రాహారాములు లేక శుష్కించి గాసిల్లిన దానవు. ఇట్టి నీవు ముండ్లు రాలు కంపలు గల అడవిలో నెట్లు కాల్నడ రాఁగలవు? అడవి మృగములఁ జూచి భీతిల్లకుందువా? నేనును వేగమ వచ్చెదను. నేఁటి రాత్రి పారణ చేసితివేని దేహమునకు కొంచెమైనను బలము వచ్చును. వలయునేని రేపు పిలుచుకొని పోయెదను.

సావిత్రి : ప్రాణనాథా! వనములఁ గల వింతలెన్నఁడును చూడమిని గదా మిమ్ము నేఁడు ప్రార్థించితిని. మీరు ఉత్తమ క్షత్రియ కులోద్భవులు. మీరు నాతోడ నుండ ఏ మృగము నన్నేమి చేయఁగలదు? ఉపవాసమున కృశించి యున్నదాన నంటిరి. నడువఁగల నను ధైర్యము నాకు లేకుండిన నేనేల మీ వెంట వత్తునని బతిమాలుకొందును. నా శక్తి నే నెఱుఁగనా? ఈ మాత్రము చిన్న కోరికయు నెఱవేర్ప మీకు మనసు రాదా? నేను మీవెంట వచ్చుయు మీకంత కష్టముగను భారముగను తోఁచిన నా భాగ్య మింతయే యనుకొందును. సత్యవంతుఁ డనునామ ముంచుకొనిన మీరే నాకోరిక నెఱవేర్చెదనని చెప్పి తప్పుటకు నాదురదృష్టము కారణము గాక మఱియే కారణము ఉండఁగలదు. మీకునే నేదియో ద్రోహము చేయని యెడల నా యందింత కఠినత్వము వహించి నన్ను చిన్న చూపునఁ జూతురా? అని పలికిన సత్యవంతుఁడు ప్రేయసీ! యీ మాత్రమున కేల యిట్లు పలికెదవు. ఉన్న విషయము చెప్పితినిగాని నిన్నుఁ బిలుచుకొని పోఁగూడ దనుతలఁపునఁ గాదు. నీయత్తమామ లనుమతించిరేని నే నవశ్యము పిలిచికొని పోయెదను అనిన సావిత్రి యత్తమామలయొద్దకు పోయి నమస్కరించి తన మనస్సున నున్న యాభిప్రాయము చెప్పెను. వారును కొన్ని యడ్డములు చెప్పిరిగానిఅన్నిటికిని ఆమె సమాధానములు చెప్పెను. వారును సంతోషించి "మన కోడలు మన యింటికి వచ్చినది మొద లొకకోరికయైనను కోరినది కాదు. కావున ఆమె యభిలాష నెఱవేర్పక పోరాదు" అని తలఁచి "పుత్రీ! నీవు మగని వెంటఁ బోయిరమ్ము. సత్యవంతుని విషయమున ప్రమాదపడకుము" అని వచించిరి.





సావిత్రియు అత్తమామల యనుజ్ఞ వడసి హృదయమున కారుచిచ్చువలె భయము బాధించుచున్నను మొగమున చిఱునవ్వును బాయక పతి తోడఁ బోయెను. అప్పుడు వారిట్లు మాటలాడిరి.



**సావిత్రి యత్తమామలచే ననుజ్ఞ తీసికొనుట**

సత్య : ప్రియురాలా! చూచితివా గరుడుఁడు కట్టి తీర్చుచున్నాఁడు.

సావిత్రి : తుదకు మనకు మేలే కలుగును గదా. భయము లేదు. ఈ యరణ్యమెంత భయంకరముగ నున్నది. కావుననే కాఁబోలు సంసారమును గహనమునకుఁ బోల్తురు.

సత్య : స్నిగ్ధయు ముగ్ధయు శీలవతియు నగు భార్యలేని వాని సంసార మని చెప్పుము.

సావి : నా జన్మము నేఁటికి సార్థకము.

సత్య : సారసాక్షీ! యీ సారనాకరము వీక్షించుము.

**కవిరాజవిరాజితము**

ఉ. "తోరములై వికసించిన కైరవతోయరుహంబుల
షట్పదఝుం! కారములున్ బహుళంబుగఁ బర్విన

క్రౌంచరథాంగ బకవ్రజసం । చారములున్ నట
సాలరసాలకుచందన భూజవితానలస । త్తీరము
లున్ గడుసొంపుదలిర్ప నుతింపఁదగున్ హ్రదముజ్జ్వలమై"

హరిశ్చం.

హంసలేమిని ఈ సరసి యింత రమణీయముగ నుండియుఁ బ్రకాశింపదు కదా?

సావి : ప్రాణనాథుఁడు లేని కాంతవలె నునుఁడు.

సత్య : భ్రమరకుంతలా! యీా వినోదము చూడుము. ఈ తుమ్మెద మోదుగుపువ్వని తలఁచి చిలుకముక్కుపై వ్రాలెను. చిలుకయు తుమ్మెదను నేరేడు పండనుకొని ముక్కుతోఁ బొడిచెను.

సావి : యథార్థజ్ఞానము లేనివా రిట్టులే భ్రమపడుచుందురు. నాథా! రెండును నలుపే కదా కాకికి కోకిలకు భేదమెట్లు తెలియవలయును?

సత్య : పండితుఁనకు మూర్ఖునకు భేదమెట్లు తెలిసికొనెదవు?

సావి : పండితుఁడు విననింపుగాను, మనస్సునకు ఆహ్లాదకరముగను, యుక్తివివేకముతోఁ గూడినట్లును సంభాషించును.

సత్య : అట్టులే యిది కాకియని యిది కోకిలయని స్వరముచేత తెలిసికొన వలయును.

సావిత్రి : వానకాలమందు కోకిల లేల కూయవు?

సత్య : కప్పలు విశేషించి కూయుచుందును గనుక.

సావిత్రి : సత్యము. అజ్ఞాను లెల్లయెడల విజృంభించి కూయునపుడు సత్కవులకు మౌనమే శ్రేయస్కరము.

సత్య ః బాలా! ఆ గండుఁతుమ్మెద దుర్బుద్ధి చూచితివా? కమ్మని తేనెగల కమలమును విడిచి మంచివాసనయు, బంగరు వర్ణము, గల కేతకిని చూచి బంగారు కమల మని ఉవ్వునవచ్చి యా మధుపము దానియందు వ్రాలెను. దట్టంపుఁ బుప్పొడి కన్నులలోఁ బడ గ్రుడ్డిదై ముండ్లచే తెక్కలు చినుఁగుట వలన పోలేక యుండలేక బాధపడుచున్నది.







సత్యవంతుఁడు సావిత్రికి వన వినోదములఁ జూపుట

సావిత్రి : తమకు సద్వస్తువు లభియించి యుండియు తృప్తిలేక మోహాశాపాతకు లగు చపలుల బ్రతుకిట్టిదే.

సత్య : కురంగలోచనా! ఆ యేటి యొడ్డున దైవచిత్రము గంటివా. నిండుచూలగు నొక ఆఁడుజింక ప్రసవవేదనచే నడవలేక బాధపడుచుండ నొకవేఁటకాఁడు దానిని జంపుటకు వింట బాణము సంధించి యెదురుగ వచ్చెను. వెనుక తేఁచు కుక్క దానిని తఱుముకొని వచ్చు చున్నది. ఒక ప్రక్క వలపన్నఁ బడియున్నది. మఱియొక ప్రక్క కారుచిచ్చు పైపైకి వచ్చుచున్నది. ఆపత్కాలమందు నేమిచేయుటకు సాధ్యపడమిని గజేంద్రునివలె దైవమును చింతించునట్లు జింక నిట్ట నిలఁబడెను. దైవమా! దీనినెట్లు కాపాడెదవో యనుకొనుచుంటిని. ఇంతలో బాణము విడువనున్న వేఁటకానిని తేలుకుట్టెను కాఁబోలు. ఆ నొప్పితో వాఁడు తటాలున విడిచిన బాణము తేఁచుకుక్కకుఁ దాఁకి యది చచ్చెను. అగ్నిజ్వాల యొకటి యెగసి వచ్చి వలలను కాల్చెను. ఈలో ఆ జింకకు చచ్చిన పిల్ల పుట్టెను. కావున ఆఁడు జింక తప్పించుకొని యుఱుకుచున్నది.



ఆఁడు జింక దైవకృపచే మృతినుండి తప్పించుకొనుట

సావి : కొండలవంటి యాపదలైనను దైవకృప వలన సూర్యుని ముందటి మంచువలె నగుటయేగాక కీడుగఁ దోఁచినదే మేలుగను నగును. మనకును దైవమే శరణము.

సత్య : మనకేమి ఆపద వచ్చినదని యట్టులనెదవు.

సావి : గరుడి కట్టిన దంటిరే. ఆ మాటకుఁగా నంటిని.

సత్య : అట్లయిన సరి. విరిఁబోఁణీ! యీ ఫలవృక్షములను చూడుము. పూల యందు భృంగములు, కొమ్మలయందు విహంగములు, నీడలయందు కురంగములు కలిగి యనేక జీవజంతువులకు నిలువపట్టై తా నెండలో నిలిచియు నెండ వడఁబడి వచ్చినవారి తాపమార్చుచున్నవి.

సావిత్రి : అంతియకాదు. ఈ చెట్లయందు గొప్పగుణము కలవి యనేకము లున్నవి. చందనము తన్నునఱకు ఆయుధమునకు నఱకువానికిఁగూడ మంచివాసన కలిగించుచున్నది. తనకుచిన్నప్పుడు ఎట్టిదో నీరు మనుష్యులు పోయఁగా నారికేళము దానిని జ్ఞప్తియందుంచుకొని అమృతమువంటి తియ్యని నిర్మలమైన నీళ్లను తలతో మోచి మరల మనుష్యుల కిచ్చుచున్నది.





సత్య : అన్ని చెట్లు అట్టివని చెప్పవలను పడదు. ఈ బూరుగు చెట్టును జూడుము. దీనియందు కాయలెంతయందముగను పెద్దవిగ నున్నవో కంటివా? ఇవి యేవో గొప్ప ఫలము లనుకొని చిలుకలు వీని చుట్టు తిరిగి తిరిగి శ్రమపడుచున్నవి. కడపట ఆ కాయలు విచ్చఁగా లోపల సారము లేదు. దూది గాలికి పోవును. కొన్ని తాము మంచి వైవను దుష్టుల కాశ్రయమిచ్చు చున్నవి. చందనముపాములకు తావుగదా. మొగలులందు మిన్నాగు లుండును గదా.

సావిత్రి : అనేక శాఖలతో దిక్కుల కల్లుచున్న యీ మఱ్ఱిచెట్టును చూడుఁడు. బావినీరు, మఱ్ఱినీడ, ఇటిక యిల్లు ఇవి యెండకాలమందు చల్లగను చలికాలమందు వేఁడిగ నుండును.

సత్య : శ్యామా! మఱియొకటి విడిచితివేల ?

సావిత్రి : కొన్నియెడల విధివిధాన మిట్టిదని యూహింప సాధ్యపడదు. అడవిలోని గరికమేసి ఏళ్ళలో నీళ్లు త్రావి యెవరి కేయపకారమును జేయని జింకల పొక్కిలిలో కస్తూరి నుంచి బ్రహ్మదేవుఁడు వానిని వధ్యములుగ చేయుచున్నాఁడే దానిని దుష్టుల కంఠమందుంచిన నెంత లోకోపకారముగ నుండును.

సత్య : హరిణాక్షీ! జింకలు చచ్చియు లోకుల కుపయోగపడుచున్నవి. వాని చర్మములను మునులును ఆశింతురు గదా. ఈ చంపక వృక్షమును చూడుము. ఇందు కొన్ని యెట్టి సంపెఁగలు. ఇవి మనోహరముగ లేవా? మంచివాసన గలవి గావా? ఏల తుమ్మెదలు వీని నంటవు? తక్కిన పుష్పములు చేసిన పుణ్యమేమి? ఇవి చేసిన పాపమేమి?

సావిత్రి : ఈశ్వరాజ్ఞ బలిష్ఠమైనేది.

సత్య : కానుగుచెట్ల నీడ కన్నతల్లి కడుపు చలువ రెండు నొక్కటి యందురే చూచితివా ఆ కానుగుల గుంపును. అదో వెదురు పొద. సద్వంశమనిన దీని కే తగును. దీనిని తుండు తుండుగ నఱికి, కాల్చి బెజ్జములు బొడిచినను విరసముగఁ బలక్కదు కదా? సద్వంశమునఁ బుట్టిన వ్యజనము సుజనునివలె దాను త్రిప్పులఁబడియైన నితరుల తాపమార్చును కదా. ఇది కఱవు కాలమందు మాత్రమే పూచి కాచి వనవాసులకు

ఆహార సౌకర్యము కలిగించుచున్నది. అయినను ఉఱుమునప్పుడు మాత్రము వీని చెంతనండ రాదందురు.

సావిత్రి : నాథా! అవి యే పక్షులు? అందొకటి యేల తలవ్రాల్చి యున్నది?

సత్య : అవి చక్రవాకములు. రాత్రిసమీపించెను గదా ఇఁక తమకు వియోగము కలుగునని వెఱచి ఆఁడుపక్షి విచారపడుచున్నది.

సావిత్రి : అయ్యో! దుస్సహము దుస్సహము.

సత్య : పిఱికీ! అల్పకాలమే. సూర్యుఁ డుదయించిన నది మరలఁ బతితోఁ గూడుకొనును.

సావిత్రి : తథాస్తు. మీరు సత్యవంతులు గదా మీమాట సత్యమగుఁగాక.

సత్య : కరుణావతీ! పరదుఃఖ మేమియు సహింపలేవు గదా? నామాట బలమేల యది విధి యేర్పాటే.

సావిత్రి : తథాస్తు.

ఇట్లు వారు సంభాషించుచు పోవుచుండ సావిత్రి మాత్రము ఏవేళ కేమో యని నూఱుకన్నుల ఱెప్పలు వ్రాల్పక యాయననే చూచుచు మునివాక్యములు స్మరించుచు ఎడపాదడపా ప్రొద్దువంకఁ గనుచు రెండుగ వ్రీలుచున్న డెందమును దిటపఱుచుకొనుచు తన మనస్సులోని తాప మొకించుకయు వెలిఁ దోఁపనీయక యేమియు నెఱుఁగని దానివలె అడిగినవానికెల్ల సదుత్తరము లిచ్చుచు మందగమనమున పతి వెంటఁ బోవుచుండెను.

## సత్యవంతుని మరణము

భార్యాసహాయుఁడైన సత్యవంతుఁడును ఫలముల సంగ్రహించి గంప నించి గొడ్డలితోఁ గట్టెలు చీల్చుచుండ నున్నట్టుండి దేహమున చెమట గాఱఁ జొచ్చెను. తలనొప్పి సహింపరాకపోయెను. అతఁడును భార్యను సమీపించి "కల్యాణీ! గాసిచేత నాకు శిరోవేదన సహింపరాకున్నది. అంగసంధు లన్నియు సడలుచున్నవి. మనస్సుచక్రమునకు కట్టినట్టు తిరుగుచు నిలుప వశము కాకున్నది. తలయందు శూలములతో పొడిచినట్టున్నది. మితభాషిణీ! కన్నులు తిరుగుచున్నవి. నిలువ దార్ఢ్యము లేదు. అస్వస్థుఁడ నైతినని తోఁచుచున్నది.





కొంచెముసేపు విశ్రమించి మఱి లేచినఁగాని నేనే కార్యము చేయ శక్తుఁడను గాను. కావున పండుకొనెద" ననఁగా సావిత్రియు నేలఁగూర్చుండి నా తొడపై శిరస్సుంచి పండుకొనుఁడని యతనిని పట్టి మెల్లగ పరుంఁబెట్టెను. సావిత్రియు నారదుఁడు చెప్పిన దినము ముహూర్తము క్షణము సంప్రాప్తించె నని లెక్కించి యాయన సూచించిన పాపపువేళ రానేవచ్చెఁ గదా యని విచారపడుచు పతివంకఁ జూచుచుండెను.

## యముఁడు సత్యవంతుని గొనిపోవ వచ్చుట

ఆయనకు ఊర్పు సన్నగిల్లెను. పాదములను హస్తములను చలువల క్రమ్మఁజొచ్చెను. స్మృతి దప్పెను. గుండె లదరుట మానుచుండెను. నాభియొద్ద ప్రాణవాయువు ముడివీడి స్థానము చలించెను. నాడులు వోఁచేతి దాఁటుచుండెను. అట్టియెడ రక్త వస్త్రధరుండును, బద్ధమౌళియు, సూర్యతేజుఁడును, వపుష్మంతుఁడును, శ్యామగాత్రుఁడును, రక్తాక్షుఁడు, పాశహస్తుఁడును, భయావహరూపుఁడును నగు నొక పురుషుఁడు సత్యవంతుని ప్రక్క నిలుచుండి చూచుచున్నట్లు ఆమెకు కనఁబడెను. సావిత్రియు నాథుని శిరము క్రింద నుంచి తటాలున లేచి రెండు చేతులు జోడించి మ్రొక్కి గుండెలు తటతట కొట్టుకొనుచుండ వణఁకు మేనితో "మహానుభావా! అమానుషమైన నీదేహమున కాంతి చూడ నీవు దైవతమని నాకు తోఁచుచున్నది. దేవేశా! నీవెవ్వ!డవు? ఏ కార్యమున నిటకు విచ్చేసితివి. ఎఱిఁగింపుమీ" యనెను.



యముఁడు సత్యవంతుని గొనిపోవవచ్చుట

యముఁడు : సతీమణీ! నేను సామాన్యులగు మనుష్యులకు గోచరించువాఁడను గాను. నీవు తపశ్శక్తిసంపన్నవు. కావున నన్నుఁ జూడఁ గలిగితివి. నీవు మహాపతివ్రతవు. కావున నీతో సంభాషింప సంతోషమగుచున్నది. నన్ను యమునిఁగా దెలిసికొనుము. ఈ నీ భర్త సత్యవంతునకు అవసానకాలము ప్రాప్తించినది. ఈయనను పాశబద్ధునిచేసి తీసికొనిపోవ వచ్చితిని.

సావిత్రి : దేవా! నాయందలి మైత్రికి నీకు నేనొర్చు నమస్కారములు గ్రహింపుము. జీవులను గొనిపోవ నీ దూతలు వచ్చువారని వినియుంటిని. ప్రభూ! నీవే స్వయముగ నిప్పుడు రాఁగారణమేమి?

యముఁడు : మనుష్యులు చేసిన పుణ్యపాపము లాలోచించి యెట్టి యోగ్యత గలవారియొద్ద కెట్టివారిని పంపవలయునో యట్టివారిని బంపుచుందును. ఈ సత్యవంతుఁడు ధర్మాత్ముఁడు. సుగుణసాగరుఁడు. ఇట్టివాని యొద్దకు భటులను పంపుట ధర్మముగాదు. కావున నేనే వచ్చితిని.

అని సత్యవంతుని దేహమునుండి అంగుష్ఠమాత్ర పురుషుని బలాత్కారముగ వెడలించి పాశమునఁ గట్టి దక్షిణముఖముగాఁ బోవుచుండెను. సత్యవంతుని శరీరము తేజోవిహీనమై నిశ్చేష్టమయ్యెను. సావిత్రి దుఃఖార్తయై తన పతిగాత్రమును మృగము లంటకుండునట్లు పదిలపఱిచి నియమవ్రతయు మహాభాగయుపతివ్రతయుఁ గావున యముని వెన్నంటి పోవుచుండెను.

## సావిత్రి యముని వెంట నంటుట

యముఁడు కొంతదూర మట్లు పోయి తిరిగి చూచి సావిత్రితో నిట్లనియె.

ఆ. వలదు వెంటరాకు పొలఁతి నివర్తింపు
మౌర్ధ్వదైహికముల నాచరింపు
భర్తృఋణమువలనఁ బరిముక్త వైతివి
మిగుల సంకటంబు మీఁది తెరువు. భారతము.

రాఁగలంతవట్టు వచ్చితివి. వృధా యేల శ్రమించెదవు పొమ్ము.





సావిత్రి :

క. పతి యెచటి కేగుఁ దానుగఁ
బతి యెచటికిఁ గొంచుఁ బోవఁబడు నచటికిఁ ద
త్సతియును బోవుట దేవా!
హితము సనాతనపు ధర్మమిది యంద్రుబుధుల్.

క. "గురుభక్తియు నీకరుణయు!
బరమపతివ్రతము తపము భర్తృస్నేహం
బురవుగఁ గల నేను దయా
కర! యరుగఁగ రాని తెరువు గలదేయెందున్.

ఆ. ఏడుమాట లాడ నెట్టివారును మిత్రు
లగుదురంద్రు పెద్దలైన వార
లిన్నిమాటలాడ నే నీకుఁ జుట్టంబ
ననుచుఁ జెప్పవలెనె యక్కతనయ!" భారతము.

కావున నావిన్నవించు వాక్యములు వినుము. వేదాధ్యయనముతోడి బ్రహ్మచర్యము, గృహపతిత్వము, వానప్రస్థము, సన్న్యాసము అనునాలు గాశ్రమములు ఆత్మజ్ఞానములేని వానికి ఫలయుతములు కావు. ఇన్నిటికిని ధర్మము ప్రాణమై యున్నది. ధర్మము ప్రాణమై యున్నది. ధర్మ మనఁగా ఆత్మజ్ఞానము. కావున నన్నిటిలో ధర్మమే ప్రానమని పెద్దలు చెప్పుదురు గాని వరుసదప్పని యాశ్రమాచారమని చెప్పరు. ఈ నాలుగింటిలో నేదైన నొకటి ధర్మయుక్తముగ జరపువానికి తక్కిన మూఁడు ననావశ్యకములు ఈ కారణము చేతనే ధర్మమే ప్రధానమని పెద్దలు చెప్పుదురు.

అనిన ధర్మరహస్యయుక్తములైన యా బాలిక మాటలు వినఁగానే యమునకు సంతోషము చేత దేహముప్పొంగి యాహా! యీమె తాను గృహస్థధర్మమందుండియే యాత్మజ్ఞానమును సంపాదించితిననియు అట్టి తనకు పతివియోగముచేతఁ గలుగు ఆశ్రమాంతరము విధించుట నాకు ధర్మము గాదనియు హిత మెఱిఁగించుచున్నది. ఈమె వయస్సెక్కడ? ఈమె ధర్మజ్ఞాన

మెక్కడ? అని తటాలున ఆమె ప్రక్క తిరిగి చూచి "బాలికా! నీవు సుస్వరముతో అక్షరస్ఖాలిత్యము లేక అగ్రామ్యపదములతో హేతుయుక్తముగ పలికిన పలుకులకు మిక్కిలి సంతోసించితిని. కావున నీకొక్క వర మొసఁగెదను. నీ పతి ప్రాణము దక్క నేదైనఁ గోరుము" అనిన సావిత్రి యిట్లనియె.

ఆ. కలిమిఁ గోలుపోయి కానలపాలయి
కనులు గానరాక కష్టపడెడు
మామగారి కిపుడు మరలఁ గన్ను లొసంగి
బలము నీఁగదయ్య భవ్యతేజ!

అని యముఁడును నీ కోరిన వరమిచ్చితిని నిలువుము. ఇఁక రాకుము. బడలియున్న దానవు. అనిన సావిత్రి యిట్లనియె. నా పతితోడ నుండు నాకు బడలిక యెక్కడిది? నా ప్రాణేశ్వరుని గమ్యస్థానమే నాకును గమ్యస్థానము. నీవు నా వల్లభు నెచటికిఁ గొనిపోయెదో నేనచటికే వచ్చెదను. నా మనవి మరలఁ గొంత వినుము. దేవేశ! సజ్జన సాంగత్యము క్షణకాలమైనను శ్రేష్ఠము. ఇఁక సజ్జనమైత్రి యుత్తమోత్తమమని వేర చెప్పనేల? సజ్జనసాంగత్య మెన్నఁడు ఫలహీనము గాదు. కావున పర్వదా సజ్జన సహవాసము మానరాదు.

అనిన అంతకుఁ డాశ్చర్యపడి తన్వీవ! నీ వచనామృతధారలు మనోనుకూలములై నా వీనులకు విందొనర్చుచున్నవి. నీ వాక్కులు హితములై బుధులకును జ్ఞానబోధ మభివృద్ధి యొనర్చునవియై యున్నవి. బాలికా! నీవు నీ పతి ప్రాణము తప్ప రెండవ వరముఁ గోరుము అనిన సావిత్రి యిట్లనియె.

"రాజ్యము వైరులచే నపహృతమగుట వలన మా మామగారు స్వకులధర్మమును పాలింప నసమర్థులై యున్నవారు. కావున వారి రాజ్యము వారికి ప్రాప్తించునట్లును, వారును స్వధర్మము నుండి చెడకుండునట్లును దేవా! యనుగ్రహింపుము".

అనిన శ్రాద్ధదేవుఁడు "కుమారీ! నీవు కోరిన వర మిచ్చితిని. నీ మామగారికి స్వరాజ్యము లభించును. స్వధర్మము నుండియు ఆయన వీడువడకుండును. నీవు చాలా శ్రమించితివి. ఇఁక మరలి పొమ్ము" అనిన సావిత్రి యిట్లనియె.





"ధర్మమూర్తీ! ప్రాణికోట్లన్నియు నియమముచే బద్ధములు. నీవును నియమము చొప్పుననే వీనిని గొనిపోవుదువుగాని యిచ్చవచ్చినట్టు విచ్చలవిడి కొనిపోవువాఁడవు కావు. కావుననే కదా నీకు యముఁడను ఖ్యాతి లోకమున నెగడియున్నది. నాయందుఁ గల ప్రీతిచే నామాటలు నీ వీనులఁ జొరనిమ్ము.

చ. ఎడపక వాఙ్మనః క్రియల నేరికి హింసయొనర్పఁ
బూన; రెౕ య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ
బ్రోవన చూతు; రిచ్చుచోఁ । గడమ వడంగ నీకెది
రి కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె । క్కుడు
మది గూర్తు రాశ్రితులకున్ వినుమన్నియు నార్య ధర్మముల్
భారతము.

ఇఁక లోకమో ప్రాయకముగ నీరాజ కుమారునట్టిద. మనుష్యులు భక్తి శక్తుల నిపుణులు గారు. కావుననే కదా సత్పురుషులు తమ్మాశ్రయించిన వైరులయందును దయనే చూపి రక్షింతురు అనిన దండధరుఁ డిట్లనెను 'మధురవాణీ!

క. తృషితుఁడగువాని శీతల
తుషారతోయములు మోదితునిఁ జేయుగతిన్
హృషితాంగుఁ జేసె నునుఁ గ
ల్మషరహితము లై నీ సమంజస ఫణితుల్. భారతము.

కావున నీ ప్రాణేశ్వరు జీవితము దక్క నింకొక్కవర మేదైనఁ గోరుము అనిన సావిత్రి యిట్లనియె. కాలమూర్తీ! నా తండ్రి మద్రేశ్వరుఁడు పుత్రహీనుఁడై యున్నవాఁడు. ఆయనకు వంశకరులగు నూర్వురు కొడుకులను నౌరసుల నొసఁగ ననుగ్రహింపుము.

యముఁడు : భూపపుత్రీ! నీ తండ్రికి నూర్వు రౌరవ పుత్రులు వంశకరు లుదయింతురు.

ఆ. వలదు నిలువు మింక వదలక నీ భక్తి
మగని కెక్కె; దుర్గమంపుఁ ద్రోవ
యిది; కృతంబు లయ్యె నెల్లవియును; నిట్లు
వచ్చు సెలవు లేదు వనజనయన ! భారతము.

చాలదవ్వు వచ్చితివి. ఇఁక మరలి పొమ్ము అనిన ఆ పరమపుణ్యశీల యట్లనియె.

రవికుమారా! పతి సన్నిధానమున నుండు నాకు దవ్వన నెద్ది? నామనస్సింత కంటెను ఎక్కువ దవ్వునకై పరువెత్తుచున్నది. నాకై నీవు నిలువవలదు. నా మాటలు నీవు పయనించుచునే వినుము.

వివస్వంతుని తనయుఁడ వగుటచే నీవు వైవస్వతుఁడన ప్రసిద్ధిగాంచితివి. వీరు శత్రువులు వీరు మిత్రులు అను తారతమ్యము లేని ధర్మముచే ప్రజల నెల్ల సమదృష్టిఁ జూతువుకావునఁ గదా ధర్మరాజను నామము నీకు బుధు లొసంగిరి. సజ్జనుల యందుంచు విశ్వాసము జనులు తమయందును నుంచుకొనరు. కావుననే లోకులు సజ్జన స్నేహమును విశేషము కోరుచుందురు. విశ్వాసమును గలిగించు నిర్మలమైన మంచి మనస్సే. ఆకారణముచేతనే కదా ధర్మాత్ములనేలోకము నమ్మియుండును.

అనిన కలకండ పలుకులవంటి యా కలికి పలుకులు విని సమవర్తి సంతోష సాగరమున మునిఁగి యా రాజపుత్రితో నిట్లనియె.

పవిత్రచరిత్రా! తేనెబిందువులతో సాటి యగు నీ మాటలు మఱియెచ్చటను విన్నవాఁడను గాను. ధర్మసంయుతమను, అర్థయుక్తమును, సందర్భోచితమును, నైన నీ సూక్తి నా మనస్సును మఱిమఱి కరఁగించుచున్నది. కావున సత్యవంతుని బ్రాణము దక్క మఱి యే వరమైనఁ గోరుమిచ్చెదను.

ధర్మరాజా! కులోద్వహులును, సత్యవంతున కౌరసులును, నాకుఁ దనూజులు నగు పుత్రుల బలవీర్య సంపన్నుల నూర్వుర నాకొసంగుము. ఇదియే నా నాలుగవ వరము.

అనిన నా బాలిక యుక్తికి యముఁడు ఆశ్చర్యమున నౌడుగఱచి మేలుమేలని మెచ్చుకొని "పుత్రీ! నీవు కోరినట్లు బలవీర్యశాలులగు నూర్వురు కొడుకులు నీకుఁ గలుగుదురు. ఇఁక రాకుము పొమ్ము. చాలదూరము వచ్చి ఆయాసపడితివి" అనిన ఆ నుడులు విని య ఆమహాభాగ యిట్లనియె.

రుక్మిణి : అప్పా! అప్పా! సావిత్రి బలేయుక్తి చేసినది. చిక్కినాఁ డామె చేతిలో యమ్మధర్మరాజు.





తండ్రీ : అదెట్లు ?

రుక్మిణి : సత్యవంతుఁడు బ్రదుకకపోయిన యెడల ఆమెకడుపున సత్యవంతున కెట్లు కొడుకులు కలుగుదురు?

అమ్మణ్ణి : యమధర్మరాజు పిచ్చిపని చేసినాఁడు. ఆ వరమునునే నీయనన వలసియుండెను.

రుక్మిణి : అదెట్లనునే? సత్యవంతుని ప్రాణమొకటి తప్ప నేది కోరినను ఇచ్చెదనని చెప్పెను. ఈ వర మీయకుండిన యమధర్మరాజే అసత్యమాడిన వాఁడగును.

సావిత్రి : దయానిధీ! సజ్జనులు సర్వదా శాశ్వత ధర్మవృత్తులు. సజ్జను లొక మాట చెప్పి దానిపై దుఃఖపాటు గాంచరు. ఆ నుడి తప్పరు. సజ్జనులకు సజ్జనులతోడి సహవాసము నిష్ఫలము కానేరదు. సజ్జనుల వలన సజ్జనులకు భయమెన్నఁడు కలుగనేరదు. సజ్జనులు సత్యముచేతనే సూర్యుని ప్రవర్తింపఁ జేయుచున్నారు. సజ్జనులు తమ తపస్సుచేతనే భూమిని ధరించి యున్నారు. భూతభవిష్యత్తులకు సజ్జను లేగతి సజ్జనులనడుమ దుఃఖపడు సజ్జనుఁడుండఁడు. ఇది యార్యసమ్మతమైన సనాతనధర్మమార్గమని యెఱింగి సజ్జనులు ప్రతిఫలము గోరిక పరులకు హితము నాచరింతురు. సత్పురుషులు ప్రసన్నులైనచో ఆశ్రితుల కోరికల వ్యర్థపఱుపరు. అట్టి ఆశ్రితులకు గౌరవహాని కాని అర్థహాని కాని కలుగనేరదు. ఈ ప్రసాదార్థ గౌరవములు సజ్జనులయందు నిత్యమై వర్తిల్లుచుండును. కావుననే చుమీ యెల్లదశలందును సజ్జనులే రక్షకు లగుచున్నారు.

యముఁడు : పతివ్రతా రత్నమా! నీవు మనోనుకూలముగ ధర్మసంహితముగ వచించు సూక్తుల వినవిన నీయందు నాకు ప్రీతి యంతకంతకు నెక్కువగుచున్నది. కావున నిఁక నుత్తమవరము నొకటి గోరికొనుము.

సావిత్రి : దేవా! ఈ సత్యవంతునకు నా యందు సుతశతకంబు గలుగ నను గ్రహించితివి. అట్టి సుతలాభంబు మా యిరువుర సాంగత్యమునఁగాని కలుగనేరదు. కావున నా జీవితేశ్వరు బ్రదికింపుము. నాపతిని విడిచి నేను బ్రదుకఁజాలను.

క. పతిలేక కలుగు సుఖమును
బతిలేక లభించునట్టి స్వర్గపదంబున్
పతిలేని యట్టిసంపద
బతిహీనపు బ్రదుకు నేను బడయఁగ నొల్లన్.

క. శతపుత్రలాభ మొదవఁగ
నతికరుణ వరం బొసంగి యదయత నా హృ
త్పతిఁ గొని పోవఁగఁ జనునే?
బ్రతికించి పతిన్ యథార్థవాదివి కమ్మీ.

## సత్యవంతుఁడు మరల బ్రదుకుట

అని కరకమలములు ముకుళించి నిలువంబడిన పడఁతిని జూచి కరుణార్ద్రచిత్తుఁడైన యంతకుండు "కులదీపకురాలా! ఇదో నీ పతిని విడిచి పుచ్చితిని. సాధ్వీ! ధర్మార్థసంహితములైన నీ వాక్కులు నామనమును బాయకున్నవి. నీ మగఁడు నీతోడ నాలుగునూర్లు సంవత్సరములు ఆయుష్మంతుఁడై సుఖించి, యజ్ఞాదు లాచరించి, నీయందు పుత్రశతంబుఁ గాంచి, సుఖించును. నీ పుత్రులును, పుత్ర పౌత్రయుక్తులై యుత్తమ క్షత్రియులై నీ నామధేయమునఁ బ్రసిద్ధి గాంచువారు. నీ తండ్రియు నీ తల్లియగు మాళవియందు నూర్వురు పుత్రులఁ బడయఁగలఁడు. వారును మాళవులను పేర సంతానయుక్తులై వెలసెదరు. నీకు శుభమగుఁ గాక. యథా సౌఖ్యముగ నిర్భయముగ మరలి పొ"మ్మని తాను తన వీటికి పోయెను.

మద్రరాజకన్యకయుః బతిని బడిసినదై మరలి కలేశరమైన తన పతి శవమున్న యెడకు వచ్చి మునపటియట్ల తన పతి శిరమును తన తొడమీఁద నుంచుకొని కూర్చుండియుండ సత్యవంతుఁడు ఊర్పుపుచ్చుచు ఇంచుక కదలుచు లబ్ధసంజ్ఞుఁడై కన్నులు తెఱచి యెచ్చటికో పోయివచ్చిన వానివలె నత్తెఱవ వంకఁ జూచి మెల్లన నిట్లనియె.

"ప్రాణేశ్వరీ! నేను దీర్ఘముగ నిద్రించితిని. నన్నేల మేలుకొలుపవైతివి. నన్నుఁబట్టి కట్టికొనిపోయిన నల్లని పురుషుఁడెవఁడు? అతఁడేఁడి?" యనిన సావిత్రి యిట్లనియె.





"ప్రాణేశ్వరా! నా తొడమీఁదనే మీరు చాలసేపు నిద్రించితిరి. మీకు గోచరించినవాఁడు భగవంతుఁడగు వైవస్వతుఁడు. మీకు నిద్ర మెలకువ వచ్చెను గదా? విశ్రాంతిగాంచితిరి గదా? రాత్రి యెంటయుఁ బ్రొద్దయినది. గాఢాంధకారము లోకమును ముంచుచున్నది. నడువ శక్తిగలదేని యాశ్రమమునకుఁ బోవుదము లెండు.

అనిన సత్యవంతుఁడు సుఖసుప్తుఁడై లేచినవానివలె లేచి దిక్కులెల్లఁ గలయఁ జూచి యిట్లనియె. 'తనుమధ్యా! ఫలాదులకై నీతోడ వనమునకు వచ్చి ఫలముల గ్రహించి కట్టెలు చీల్చుచుండ తాళరాని తలనొవ్వు పుట్టుటయు సహింపలేక నీకుఱువుపై శిరముంచి పరుండితిని. నీకౌఁగిటనే నేను నొండ లెఱుఁగక నిద్రించితిని. అట్టి సమయమున లోకమంతయు చీఁకటు లావరించునట్లు తోఁచెను. అయిరుల నడుమ ఘోరరూపము గలవాఁడు, నల్లని మేనివాఁడు, మహాకాంతి యుక్తుఁడువి నా కనులకు గోచరించెను. వాఁడెవఁడో. ఇది కలయో నిజమో నీ వెఱుంగుదేని తెలుపు" మనిన "రేయి ప్రొద్దెక్కుచున్నది. సర్వము రేపు మీకు నెఱిఁగింతును. సూర్యుఁ డస్తమించెను. చీఁక ట్లాక్రమించెను. నట్టడవినున్నవారము. మీ తల్లిదండ్రులు మనమింత తడయుట కెంత తపింతురో.

మ. అదె నక్తంచరు లిందు నందును మహోగ్రాకారు
లై క్రందుగా । మెదలం జొచ్చిరి, ఘోర ఫేర
వరుతుల్ మిన్నందెఁ ఈగ్రంబులై । పద శబ్దంబులు
మీఱెఁ, జూడుకలయం బాఱండొడంగెంబెనుం।
గదుపుల్ గట్టి మృగంబు, లెంతయు భయోత్కంపంబు
నా కయ్యెడిన్. భారతము.

క. విను నీవు తడయుటకు మీ
జననియు జనకుండుఁ గరము సంతాపధరం
బునఁ బొందదు రింతకుఁ గ్ర
న్నన వారికి సంతసం బొనర్పవె యధిపా! భారతము.

సత్య : ఆకాశమున మబ్బులు దట్టముగ వ్యాపించియున్నవి. ఒకరిమొగ మొకరికి తెలియరాకుండ చీఁకట్లు క్రమ్మినవి. వనమా భయంకరముగ

నున్నది. మార్గము నీవెట్లు కనుఁగొనఁగలవు? త్రోవ నడచుట కెట్లు శక్తురాల వగుదువు?

సావిత్రి : ఇంతకు పూర్వ మీయడవి కారుచిచ్చుచే దగ్ధమైనది. ఎండు చెట్లింకను గాలుచున్నవి. వాయువు వీచుటచే నగ్నియు అందందుఁ గానవచ్చుచున్నది. ఆ యగ్నిని తెచ్చి యిందున్న కట్టెలతో మంట వేసెదను. వెలుతురు కట్టెఉ కొన్ని వెలిఁగించెదను. వానిని తీసికొని పోదము. సంతాపము వీడుఁడు.

చ. "తమమును బెల్లుగాఁ బరఁగె; దవ్వు నిజాశ్రమ
భూమియున్; మదిన్, శ్రమమును బాయ దిప్పు
నను చందమయైనఁ జనంగ నేల! యి । పమ
రఁగ నింత ప్రొద్దు సుగుణాకర ! యిచ్చటనిల్చి ।
రేపు పో, దమె? తెఱఁ గెద్ది?" నీమతమ తప్పక
సల్పెదఁ జెప్పు మిష్టమున్.

సత్య : ప్రియా! నాకు శిరోవేదన తొలఁగినది. అంగములు స్వస్థములు. తల్లిదండ్రులఁ జూడక నే నిందుండఁజాలను. నాయందు ప్రసన్నురాలవైన న్నెటులైన తల్లిదండ్రులఁ గలుపుము. అకాలమందెన్నఁడును నేను ఇల్లు విడిచి యుండిన వాఁడను గాను. సంధ్యవేళకు నేనింటికి రానేని నాతల్లి వాకిట నిలఁబడి నాకై నలుదిక్కులు వ్యాకులదృష్టితో చూచుచుండును. పగటిపూఁట నేనెందుపోయెద ననినను నా తండ్రి యెంతో సంతాపపడి కొడుకు వచ్చినాఁడా? బిడ్డఁడు ఇంకను రాలేదా? అని వేయాఱుమార్లు నాతల్లిని అడుగుచుండును. అట్టివారింత ప్రొద్దుపోయియును నేను రామికై ఆశ్రమవాసుల తోడ్పటుచే నెందెందు వెదకుచున్నారో, ఎంత దుఃఖించుచున్నారో, నాకై యేగతి పట్టిరో నే నెన్నఁడైన సాయంవేళ నొక నిమిషము మించి వచ్చిన నన్నుఁ జేరఁదీసి యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని భుజముపై చేయివైచి మఱియొక చేత నా చుబుకమును గ్రహించి మోము తమ వంకకుఁ ద్రిప్పి "నాయనా! కుమారా! నీవు మాకు దిక్కు. నీవు మాకు గతి. నీవే మాకు కన్నులు. నీవే మాకు ఊఁతకఱ్ఱ. నీవే మాకు జీవగఱ్ఱ. మమ్ము నీవు విడిచిన గడియ యొక





కల్పముగ నుండును. తండ్రీ! మా మనోవేదన నీవెఱింగి మాకు సంతాపము గూర్పకుము. మమ్మును మా కులమును ఉద్ధరించు భారము నీయందున్నది. ఇహపరములందు రెంట నీవే యాధారము" అని కన్నీరు లురల దీనాలాపములు పలుకుదురు. అట్టివారు నేనింత తడయుటకు నెంత విలపించుచున్నారో. ఛీ నాతల్లికి నాతండ్రికి నాకుఁ గూడ జీవిత సంశయముఁ గూర్ప పాడునిద్ర నా కెక్కడనుండి వచ్చెను. సంధ్య వేళ నిద్రింపరాదని యెఱింగియు నేనేల నిద్రించితిని. ఇది యా దురాచార ఫలము కాఁబోలు. సత్యము సత్యము. ఇంతకాలము నన్ను విడిచి వారు జీవించియుందు రనుట కల్ల. నా యట్టి నిర్భాగ్యున కింకెక్కడి తల్లి ఎక్కడి తండ్రి? వారే జీవింపనిచో నేను జీవింపనేల? నా కొఱకై నేను జీవింపనేల? నాకొఱకై నేను దుఃఖింపను గాని నా నిమిత్తముగ వారెంత సంకటపడుచున్నారో యని దుఃఖించెను. వారిని భరించు భారము నాయందున్నది. కావున వారు జీవించియుండు వఱకు నేనును జీవించియుందును. వారికి ప్రియముఁ గూర్పవచ్చును గదా యని జీవింప నుత్సహించుచున్నాను. వారే నాకు పూజనీయులు. వారే నాకు పరమదైవతము. వారిని పూజించుటే నాకు పరమ వ్రతము.

ఆ. "సంధ్య ప్రొద్దునన్ను జనని యెన్నఁడు నిలు
వెడల నీదు; నేఁడు విపిన భూమి
మధ్యరాత్రివేల మసలుట కాయమ
యేమి పాటుపడునొ యేనెఱుంగ.

క. నాయున్నచో టెఱుంగక
యాయాశ్రమవాసులైన యందఱ నతిదుః
ఖాయత్తుఁడగుచు నడుగును
మాయయ్య దలంకి మాటిమాటికి నింకన్.

సీ. కౌఁగిట నను‌ఁ జిక్కఁ గదియించి శిరము మూ
ర్కొంచును బాష్పముల్ గురియుచుండఁ
బట్టి! మాయొడలును బ్రాణంబులును నెల్ల
యర్థముల్ నీవు; మాయన్న! నీవు

తేపగా సంసార తీరంబు చేరెద
మని తలంచెదము నుమ్మన్న యన్న!
కన్నులులేని మాకన్నులుఁ గాళులు
నీవ కదన్న; మానిఖిల వంశ

ఆ. మును సముద్ధరించు మోపు నీయదియ క
దన్న; యనుచు నిట్టు లగ్గలంపుఁ
బ్రేమ ననుదినంబుఁ బ్రేముడింతురు వృద్ధు
లక్కటకట! యేమియైరొ నేఁడు" భారతము.

అని గురుభక్తుఁడును గురుప్రియుఁడునునగు నా రాజకుమారుఁడు అనేక విధముల తలఁచి బాహువు లెత్తి హెూయని యేడ్చెను. సావిత్రియు శోకపీడితుఁడైన భర్తను జూచి సమాధాన వాక్యములు చెప్పి తన పాణితలమున నతని కన్నీరు దుడిచి యాధర్మచారిణి "దేవతలారా! నేను తపము, దానవము, హెూమము చేసినదాన నేని అసత్యమెన్నఁడు నాడియుండనేని నా పుణ్యముచే నా యత్తమామలకును భర్తకును ఈ రాత్రి యెట్టి కీడు కలుగకుండుఁగాక" యనుటయు సత్యవంతుఁడు "రాజపుత్రీ! మన మిచటఁ దడయరాదు. తల్లిదండ్రులు జీవితులై యుండఁగనే పోయిచూడఁ గోరెద. గురువుల కేదైన నెదరు పుట్టెనా నేను మరల బ్రదుకఁజాల నని శపథము చేసి చెప్పెదను. కావున నేను జీవింపఁగోరెదవేని నాకు ప్రియమైన కార్యము చేయ నీ కిష్టమేని యాశ్రమభూమికి నన్నుఁ దోడుకొని పొమ్ము"

అనిన సావిత్రియు వెంటనే లేచి తలవెండ్రుకల ముడిచి పెనిమెటి మడిసందుల తన యిరుకేలు దూర్చి మెల్లన లేవనెత్తి నిలువఁ బెట్టెను. సత్యటవంతుఁడును నిబ్బరించుకొని నిలువఁబడి తన హస్తముల మేనిదుమ్మెల్లఁ బోఁదుడుచుకొని దిక్కులెల్లఁ గలయఁజూచి గంపపై దృష్టి నిగిడించెను. ఆయన హృదయము గ్రహించి యా బాలిక "నాథా! యీ ఫలములను రేపు మీరు తేవచ్చును. మన యోగక్షేమార్థము ఈ గొడ్డలిని మాత్రము నేను తెచ్చుదను" అని చెప్పి యా పండ్ల గంపను చెట్టుకొమ్మకు కట్టి గొడ్డలిని మాత్రము తీసికొని భర్త యొద్దకు వచ్చి యాతని యెడమ చేతిని తన యెడమ మూఁపుపై నుంచుకొని తన కుడిచేత నతఁడు పడకుండ కౌఁగిలించి పట్టుకొని యెడమచేత గండగొడ్డలిని దాల్చి యాగజగమన పయనించెను.





## సావిత్రీ సత్యవంతులు మరల నాశ్రమమునకు వచ్చుట

ఇట్లు కొంచెము దూరము పోవఁగానే సత్యవంతుఁడును వనాంతరముల వీచు కమ్మని చల్లనిగాలి సేదదేఱి ముఖప్రసన్నత వహించి "భీరూ! రాకపోకలచే నాకిదివఱ కలవాటు పడిన బాట చేరితిమి. కొమ్మల నడుమ నుండి తప్పిదారి వచ్చు వెన్నెలయు కొంచెము గోచరించుచున్నది. ఇదో యీ మఱ్ఱిచెట్టు నొద్ద త్రోవ రెండుగ చీలుచున్నది. ఉత్తరపు మార్గము మన యాశ్రమమునకుఁ ఉత్తరపు మార్గము మన యాశ్రమమునకుఁ బోవును. నేను స్వస్థుఁడనైతిని. దేహమునకుఁ బలమును వచ్చెను. భయపడక మనము వచ్చిన త్రోవనే త్వరగ నడువుము" అని యిట్లు మాటలాడుచు వారాశ్రమమునకు పోయిరి.

## సత్యవంతుని తల్లిదండ్రులు పరితపించుట

ఈ లోపల ద్యుమత్సేనుఁడు లబ్ధచక్షుఁడై దృష్టిపాటవము గలిగి నలుదిక్కులు పాఱఁజూచి యేమి యీ వింత యని తన భార్యయైన శైబ్యతో ముచ్చటలాడుచు తన కొడుకు కోడలు ఇంకను రారైరేయని తహతహ పడుచుండెను. సూర్యుఁడస్తశిఖరిమీఁద నిలఁబడెను. సంజకెంజాయలు వ్యాపించెను. పక్షులు కలకల శబ్దములతో పచ్చిగూండ్లు చేరుచుండెను. ప్రొద్దుగ్రుంకెను. కెంజాయ లడఁగెను. మూఢుని మనస్సును అజ్ఞానము ముచినట్టు ఇరులు క్రమక్రముగ లోకమును ముంచుచుండెను. తమ కూఁతలచేఁ దపస్వుల మనస్సులు చలింపఁ జేయరాదనియో పక్షులు మౌనము వహించెను. చెట్లయందు రెమ్మలు కమ్మలు బేధమణఁగి యేకాకారమునఁ దోఁచెను. తుదకు చెట్లు చెట్లు పలుచనగా నచ్చటచ్చటఁ దోఁచి చుక్కలు గగనమున కలయనిండెను. ఆ వృద్ధదంపతుల మనస్సున కన్నులు వచ్చిన సంతోషము తగ్గుచు వచ్చెను. తహతహ పాటొదవెను. కలవరముజనించెను. తత్తఱ హెచ్చెను. సందేహముదయించెను. విచారము మీఱెను. విషాదము ముంచెను. మనస్సు వేయివిధముల పరువిడఁ జొచ్చెను. వారుకా లొకచోట నిలువక కాలుగాలిన పిల్లులవలె నాయనా! సత్యవంతా! కోడలా! సావిత్రీ! కొడుకా! పుత్రా! అమ్మా సావిత్రీ! యని యఱచుచు గట్టిగ! బిలుచుచు కాఱుచీఁకటిలో త్రోవ తెలియక పోయి ముండ్ల కంపలు గడుసు శిలలు త్రొక్కి పాదము లెఱ్ఱనై, బొబ్బలెగిరి, పగిలి నెత్తురు కాఱ నడవలేక కంటికి కడవెఁడు కన్నీరు గార్చుచు మరలి వచ్చి

యాశ్రమమునఁ గూర్చుండి హెూయని యేడ్చిరి. “హాతండ్రీ! మేమెట్టినిర్భాగ్యులము. లేక లేక నిన్నొక పుత్రుని గని నిన్నైనను సుఖపెట్టఁజాలక యడవులపాలు చేసితిమి. రాజపుత్రుఁడ వని పుట్టినందునకు నీకు మేము చేసినది యేమి? కట్టను మంచి వస్త్రముగాని తినను మంచి యన్నముగాని నాయనా తీసికొమ్మని యిచ్చునంతటి పుణ్యము మేముచేయమైతిమిగదా. ఈ పాపపుఁ జేతులు నీకు నారచీరలు నివ్వరి కూడేకదా పెట్టెను. మేమెట్టివారమైనను నీవు మమ్ము ప్రత్యక్ష దేవతలమని పూజింతువే. ఇహమునఁ బరమున నీవు మమ్ముద్ధరింతువని నమ్మియుండ దైవమింతటి చిన్న చూపు చూచెనే. తండ్రీ! నీ బాల్యచేష్టలు మేమెట్లు మఱతుము? నీవు చేయు సపర్యలు మేమెట్లు విస్మృతి గాంతుము. ఇఁక మాకెవ్వరు దిక్కు. హా కోడలా! గుణనిధీ! నీవు కోడలవా! మా పాలి పెన్నిధానమని తలంచియుంటిమే. మేమే జన్మమున నే పుణ్యము చేసితిమో నిన్నుఁ గోడలిగఁ గాంచితిమని యుప్పొంగుదుమే. నీవు మా గృహలక్ష్మివని సంతోషింతుమే. వేయిమింది పుత్రికలైనను నీ సాటివత్తురా? తల్లీ మీకెవరి కేవిపత్తు సంభవించెనో. ఒకరిని విడిచి మఱియొకరు రాఁజాలక యిరువు రేగతిపట్టితిరో లేకున్న నట్టడవిని కన్ను పొడుచుకొనినను కానరాని చిమ్మచీఁకటిలో నడిరేయిదాఁకతడయనేల”యని యనేకవిధముల విలపింప నాయాశ్రమమందలి ఋషీశ్వరులు వచ్చి “రాజేంద్రా! నీకు కన్నులు వచ్చుట శుభసూచకముగాని యశుభసూచకము గాదు. ఇదియే నీకు గొప్పమేలు రాఁగలదని సూచించుచున్నది. ఇట్టి సమయముననీకు దుఃఖము కలుగఁ గారణము లేదు. సావిత్రి మహాపతివ్రత. ఆమె యందు శుభ లక్షణము లనేకము లున్నవిగాని వైధవ్య లక్షణ మొక్కటియును లేదు. పతికి దీర్ఘాయువు కలిగించు మహావ్రతము సాంతము చేసి యుపవాసముండియే భర్తవెంట పోయియున్నది. ఆమెకుఁగాని ఆమెభర్తకుఁ గాని యొక కీడును గలుగనేరదు. శుభాచారులకు కీడెవఁడు చేయును? మేము వ్రతనిష్ఠులమై బ్రహ్మచర్య మవలంబించి గాలి నీరు ఆహారముగాఁ గలవారమై తపస్సు చేయువారము. మా మాటతప్పదు. వారి కెట్టి కీడును గలుగదు అని యనేక విధముల నోరంత ప్రొద్దు సమాధాన పఱచుచుండిరి.







**సావిత్రి సత్యవంతుని ఆవ్రమమునకుఁ దోడి తెచ్చుట**

అట్టి సమయమున సవిత్రీసమేతుఁడై సత్యవంతుఁడు ఆశ్రమమునకు వచ్చెను. పోయిన ప్రాణములు మరలవచ్చినట్టులై నాయనాయని లేచి ద్యుమత్సేనుఁడు కొడుకును కౌఁగిలించుకొనెను. కూఁతురాయని శైబ్య కోడలిని కౌఁగిలించుకొనెను. వారి కనులవెంటఁ గాఱుచున్న వేఁడినీరు తటాలున చల్లనయ్యెను. ద్యుమత్సేనుఁడు మునులు ఒక్కప్రక్క నుండిరి. శైబ్యయు సావిత్రీ సత్యవంతు లొక ప్రక్క నిలిచిరి.

అప్పుడు మునులు సత్యవంతునిఁ జూచి రాజకుమారా! వనమునకు పోయినవాఁడవు ఇంతసేపేల తడసితివి? సూర్యుఁడస్తమింపకుండుమున్నే యేల రావైతివి? నీకేమి యాటంకము కలిగెను? ని న్నెవ్వ రడ్డగించిరి? అనిన నతఁ డిట్లనియె.

మునీంద్రులారా! నేను సావిత్రితోడ వనమునకుఁ బోయి ఫలముల సేకరించి కట్టెలు కొట్టుచుండ నాకు సహింపరాని తలయేరు కలిగెను. దానికి తాళలేక నేను కొంతసేపు పరుండి నిద్రపోయి లేచి వచ్చితిని. ఆకారణముచే కాలవిళంబ మయ్యెను. మఱేమియు నే నెఱుఁగ మీకందఱకు నా వలన చింత కలుగకుండ నర్ధరాత్రమైనను వచ్చితిని.

మునులు : కుమారా! రాజేంద్రునకు కన్ను లెట్లు వచ్చెనో తెలుపఁగలవా?

సత్య : దాని కారణము నాకేమియుఁ దెలియదు.

మునులు : అమ్మాయీ సావిత్రీ! మీ మామగారికి కన్నుల వచ్చిన కారణము నీకు తెలిసియుండవలయును. రహస్యముగాక చెప్పఁగూడునేని చెప్పెదవా? ఇది నీకుఁ దెలియక జరగినది కాదని మా నమ్మకము.

సావిత్రి : మహాత్ములారా! మీకుఁ దెలియని విషయము తెలియరాని విషయ మేదియుండును. నేఁటికి సరిగ సంవత్సరమునాఁడు నేను పుట్టినింట నుండు సమయమున నా వివాహ ప్రస్తావన రాఁగానే నీ మహామహాని కుమారుని వరించితిని. ఈ సత్యశీలుఁడు సరిగ సంవత్సరమునాఁటికి మరణించునని భగవంతుఁడగు నారదుఁడు మే ముందఱము వినుచుండఁ జెప్పెను. ఆయన చెప్పినది నమీదినమే. కావుననే నేను నా పతికి ఆయుష్యము గోరి త్రిరాత్రోపవాసము నాచరించి యాయన వెంట కానకు పోయితిని. నా భర్త పరుండియుండ ధర్మరాజు సకింకరుఁడైవచ్చి ఆయన ప్రాణములను హరించి పితృదేవతలుండు దిశకై పోయెను. నేను వెంటనంటి అనేక విధముల సత్యవాక్యముల స్తోత్రము చేఁయఁగా నా కైదు వరములిచ్చెను. ఒక వరముచే మామగారికి కన్నులు వచ్చెను. రెండవవరముచే వీరికి రాజ్యము ప్రాప్తించును. మూఁడవ వరముచే మా తండ్రికి సుతశతలాభము కలుగును. నా నాలుగవ వరముచే నాకు నూర్వురుకొడుకులు జనింతురు. ఐదవ వరముచే నా పెనిమిటి నాలుగు నూర్ల సంవత్సరముల జీవించును అనిని నమ్మహామునులిట్లనిరి.

చ. కరము మహాపదంబునిధి గాఢతమోహ్రదమందు
దిక్కులే। కరయఁగ మున్గనుండిన మహామహు
వంశము నీవు తెప్పవై। పరమ సుశీల! మోవిమల
వంశసముద్భవ। సువ్రతాన్వితా! కరుణ సముద్ధ
రించితివి; కల్గుదురే నినువంటి సాధ్వులున్.

అని యామహాభాగను అనేక విధముల స్తుతించి రాజుచే వీడుకోలు వడసి యాముచ్చటలే చెప్పుకొనుచు వారి వారి యుటజములకు పోయిరి. ద్యుమత్సేనుఁడు కోడలి గుణము లగ్గించుచు,





ఉ. కోడల వీవు గావు సుమకోమల! నన్నును నాకు
లంబునున్। గీడుమ బొందకుండ దరకిం దఱిఁ
జేర్చిన యట్టి వేలుపుం। బ్రోడవు గేహ దేవతవుపో
యిటు జన్మముఁగాంచితమ్మ నీ। యీడగు పువ్వుఁ
బోఁడిమునుపెన్నఁడు కంటిమె వంటిమేధరన్.

ఆ. ఎఱిఁగి యెఱిఁగి యెవతె హీనాయు వగువానిఁ
దావరించు వలపు తద్దయున్న?
యముని మెచ్చఁ జేసి ప్రాణేశు ప్రాణంబు
మరలఁ దేఁగలట్టి మగువ యెవతె?

అని సంభాషించుచుండ నుషఃకాలమగుటయు కాలోచిత కృతముల వారు వారు నిర్వహించి యుదయమున మరల వచ్చిన మునులతో సంభాషించుచుండ సాల్వదేశ జనులు సమంత్రిపురోహితులై వచ్చి చక్షుష్మంతుఁడును వపుష్మంతుఁడునైన ద్యుమత్సేనుఁ జూచి సంతోషమునఁ బొంగి నమస్కరించి యిట్లనిరి.

## ద్యుమత్సేనుఁడు మరల రాజగుట

ఆరోగ్యవంతుఁడవును నేత్రవంతుఁడవును నగు నిన్నుఁ జూడఁగలుగుటకు మే మెట్టి పుణ్యము లొనర్చితిమో యెఱుఁగము. నీ విరోధిరాజు తనమంత్రిచేతనే చంపఁబడెను. చంద్రుఁడు లేని రాత్రివలె మీరాజ్యము ప్రకాశింపకున్నది నావపగిలిన జనము వలె ప్రజలు విపత్తున మునిగియున్నారు. నట్టడవిఁ దెరువు తప్పినవారివలె నెటుపోవుటకు నేమి చేయుటకు తోఁపక దిగ్భ్రమగొని యున్నాము. నీవిప్పుడు పురికివిచ్చేసి మునుపటియట్ల యేలికవై నేలఁ బాలింపుము. ప్రజలకష్టముల నున్మూలింపుము. లోకులను నానందసాగరమునఁ దేలింపుము. నాలుగుజాతులందును ప్రముఖులెల్ల నిన్నుఁ బ్రార్థింప వచ్చియున్నారు.

అని పెక్కువిధముల వేఁడుకొన ద్యుమత్సేనుఁడును ఆశ్రమవాసుల యంగీకారము వడసి వారిచే దీవనల నొంది భార్యతోడను కొడుకుతోడను కోడలితోడను సాల్వ పురికి పయనించెను. ద్యుమత్సేనుఁడును సత్యవంతుఁడును

రథముల మీఁదఁ జనిరి. శైబ్యయు సావిత్రియు పల్లకులయందు పోయిరి. ఇట్లు పోయి ద్యుమత్సేనుఁడు సాళ్వపురిఁజేరి మరలఁ బ్రభువై ధర్మముఁదప్పక భూమిఁ బాలించుచుండెను. మద్రరాజును ఈ శుభవార్త విని వారిని జూడవచ్చి యావద్వృత్తాంతమెఱిఁగి పుత్రికను వేనోళ్లఁ బొగడి పోయి పుత్రులను గాంచి సుఖముండెను. సావిత్రియు క్రమముగ నూర్వురు పుత్రులఁగాంచి నాలుగునూర్ల సంవత్సరములు పతితోడ సుఖించెను.

క. ఈ సావిత్రి చరిత్రం
బేసతి పఠియించు శ్రద్ధ నెపు డాసతియున్
శ్రీసౌభాగ్య సుతాప్తిని
భాసిలు వైధవ్యభయముఁ బాయు నరేంద్రా!

ధర్మనందనా! వింటివి కదా సావిత్రీమాహత్మ్యము, బాలిక యయ్యు తనజ్ఞాన సంపదచేతను, పాతివ్రత్యము పెంపునను మృత్యువు వాతఁబడిన మగని బ్రదికించుకొనెను. పుట్టినిల్లు వర్ధిల్లఁజేసెను. అత్తమామలను కష్టదశనుండి తొలఁగించెను. ఈ ద్రౌపదియునట్టిద మిమ్ము నాపదలనుండి యుద్ధరించును. ఆమె పాతివ్రత్యమే మీకు శత్రుజయము గలిగించి సుఖమిడును. స్త్రీలకు శీలమే యుత్తమ భూషణము కులము నలంకరించునది శీలమే. సమస్తము శీలముచేతనే సాధ్యము. అట్టి శీలముచేఁ బ్రకాశించు యిల్లాండ్రఁగల భర్తలకు ఇహపర సుఖములు కరతలామలకములు. కావున విషాదపడకుఁడని చెప్పి మార్కండేయుఁడు పోయెను.

రుక్మిణి : అప్పా సావిత్రి మగని బ్రతికించు కొనునప్పటికి పదునాలుగు పదునైదుసంవత్సరముల పిల్లగదా. ధర్మరాజు మెచ్చుకొనునట్లు ధర్మవాక్యములు పలుకునంతటి జ్ఞాన మెట్లు సంపాదించెను? ఏ పాఠశాల యందుఁ జదివెను? ఆమె కట్టి జ్ఞానము కలిగించిన యుపాధ్యాయులు ఏయే పరీక్షలఁ గడతేఱినవారు?

తండ్రి : సావిత్రి చెప్పిన ధర్మవాక్యములు సందర్భమునకుఁ దగని పురాణ వాక్యములు గావు. ఆ వాక్యములు తనకు యమునకుఁ గూడ నన్వయించునవియై యమునకు కర్తవ్యమును బోధించునవియై యున్నవి. ఆత్మజ్ఞానము గలిగి స్వధర్మమున చరించు నాయట్టిదానికి వైధవ్యము





కలిగించుట ధర్మమూర్తివగు నీ యట్టి వానికి ధర్మము గాదనియు నీవు చేయునది సరిగాదనియు సూచనసేయు వాకక్యములను సవినయముగా వచించెను. ఆమె పతిభక్తికి, జ్ఞానమునకు చమత్కారోక్తికి యముఁడు మెచ్చెను. ఆమె వా వచ్చుచున్నారని, మాత్రము సంతోషించుచున్నారు.

సత్యము చెప్పుము అని గ్రంథములందుఁ జదివి బాలుఁడో బాలికయో యసత్యమాడిన "ఇదా నీవు చదివినచదువు" అని ఆక్షేపింపఁబడుచుండిరి. అట్టులే ఆచారవిషయము చదివి దానికి విరుద్ధముగ నడచిన బాలురు దండింపఁ బడుచుండిరి! ఒక శబ్దము సాధురూపము పుస్తకమునఁ జదివి మాటలాడునపుడు అసాధురూపము ప్రయోగించిన పరిహసింపఁ బడుచుండిరి. ఈ విధముగా బాలురకు అధ్యయనము ఆచరణము సమముగా వర్తించుచుండెను. ఇట్టులే బాలికలును శాస్త్రములోని విషయములను వినికిచేతను తల్లిదండ్రుల బోధన చేతను నేర్చుకొని సత్ప్రవర్తనము గలిగి పుట్టిన యింటికిని మెట్టిన యింటికిని కీర్తిప్రతిష్ఠలు తెచ్చుచుండిరి. విద్యవలన సాధింపవలసిన ముఖ్యవిషయము జ్ఞానము. అది చదువను వ్రాయను రాకపోయినను మీఁద చెప్పిన పద్ధతుల చొప్పున నైన సంపాదింపవచ్చును. కావుననే సీతాదేవి, సావిత్రిలోనగు ఆర్యస్త్రీలు జ్ఞానవంతులని గ్రంథములఁ గొనియాడఁబడిరి. గాని చదువను వ్రాయను వచ్చినవారని మెచ్చు కొనఁబడినవారు గారు. జ్ఞానము లేని విద్య ప్రాణము లేని దేహము సమానములు.

ఇంటఁ జదువు చెప్పుటకు వలనుపడని తల్లిదండ్రులు కుమారులను వేఱొకగురువు నొద్దకుఁ బంపుచుండిరి. ఆ గురువులును జీతము బత్తెము గైకొనక తామే శిష్యులకు అన్నము పెట్టి విద్య నేర్పుచుండిరి. అన్నము పెట్టు శక్తి విద్య నేర్పుచుండిరి. అన్నము పెట్టు శక్తి గురువునకు లేనపుడు మధుకరవృత్తిచే శిష్యులు జీవించుచు విద్య నేర్చుకొనుచుండిరి.

క. "అతిరోషుండయి శాంత
స్థితికి, మదిం గపటమూఁది చెలిమికి, సుఖసం
గతుఁడై విద్యకుఁ బరుష
వ్రతుఁడై యంగనకు నాసపడఁ జనదెందున్"

అను నీతి ననుసరించి సుఖము మరగిన వాఁడు చదువునందుఁ

గుశలుఁడు గనుక శిష్యులు శుశ్రూషాది కార్యములు చేసి కష్టించి విద్య గ్రహించుచుండిరి. ఇట్లు చేయువారు బాలురేగాని బాలికలు గారు. బాలిక లెప్పుడు నింటనుండువారే. ఇంట నుండియే కులస్త్రీలకుఁ గావలసిన ఉత్తమాచార జ్ఞానములను బాలికలు సంపాదించుచుండిరి. పర పురుషగోష్ఠి శీలహానికి కారణమగుననియు అసమానులతో కలిసి మెలసి యుండుట తేజోహానికి గారణమగుననియు నెంచి తల్లిదండ్రులు పుత్రికలను విచ్చలడివి తిరుగనిచ్చినవారు గాక శుభోదర్కమైన విషయములనే వారికి బోధించుచుండుటయే క్షుద్రవిషయములకు బాలికల మనస్సున నెడము లేకుండెను. ఈ విధముగఁ బెరిఁగిన వారగుటచేత సావిత్రి, సీత, దమయంతి , చంద్రమతి లోనగు వేనవేలు పూర్వస్త్రీలు అంతటి గొప్పవారైరి. ఆ పద్ధతులున్న చోట నట్టి స్త్రీలే పుట్టుదురు. కొన్ని దృష్టాంతములు చెప్పెదను.

రత్నఖేటుఁ డను నొక గొప్పపండితుఁడుండెను. ఆయనకొమార్తె యొకనాఁ డుదయమునవాకిట పేఁడనీళ్లు చల్లుచుండు సమయమున నొక పండితుఁడు వచ్చి "అమ్మాయీ! రత్నఖేట దీక్షితులవారున్నారా" యని యడిగెను. ఏలయని యా బిడ్డప్రశ్నించెను. శాస్త్రవాదమునకై వచ్చియున్నాను అని చెప్పఁగా ఆ చిన్నది నవ్వి కలయంపి చల్లుచునే యామట్టునకు సరిపోవునట్లు ఆశువుగా

శ్లో॥ విపశ్చితా మపశ్చిమే వివాదకేళినిశ్చలే
సపత్నిజి ద్యయత్న తస్తు రత్నఖేటదీక్షి తే
బృహస్పతిః క్వజల్పతి ప్రసర్పతిక్వసర్పరా
డుసమ్ముఖశ్చ షణ్ముఖ శ్చతుర్ముఖశ్చ దుర్ముఖః

అను శ్లోకము చెప్పెను. అనఁగా నా తండ్రివారగు రత్నఖేటదీక్షితులు ప్రతివాదుల నప్రయత్నముగనే గెలుతురు. ఆయన ముందర బృహస్పతి నోరు తెఱవలేఁడు. శేషుఁడు నిలువలేఁడు. షణ్ముఖుఁడు మొగము వ్రేలవేసికొని పోవును. బ్రహ్మయును మాఱుమోము పెట్టును అని అర్థగాంభీర్యము అర్థయుక్తములైన మాటలు గలట్టు చెప్పెను. ఆమె ప్రజ్ఞకే క్రొత్తపండితుఁడు భయపడి రత్నఖేటునితో వాదింపకయే వెడలిపోయెను.

లీలావతి తండ్రివలననే గణితశాస్త్రము నేర్చెను. పెద్దిబట్టుఆయన మఱఁదలు వ్యాకరణసూత్రములతోనే యొకరినొకరు పరిహాసము చేయుచుండిరి.





ఒక గృహస్థున కొకకూఁతు రుండెను. దానిని ఆ వీధిలోనే యుండు మఱియొక బాలున కిచ్చి వివాహము చేయ నుద్దేశింపఁగా తండ్రిని చూచి యాకన్య

"యస్య షష్ఠీ చతుర్థీచ
విహస్య చ విహాయ చ
అమం కథం ద్వితీయా స్యాత్
ద్వితీయాస్యా మ్యహం కథమ్"

విభక్తిజ్ఞానము శబ్దస్వరూపము తెలియని యాబాలుని తాను వివామ మాడనని చెప్పెనఁట.

తరిగొండ వెంగమ్మ కవిత్వము యోగము కూడ నెఱిఁగి యుండెను.

సంస్కృతమున గొప్ప పండితులు కవులునగు దండి కాళిదాసులు నేను కవిని నేను కవిని అని కలహించి పరీక్షార్థము దేశసంచారము చేయఁబోయి యొకయింట దిగిరి. భోజనానంతరము తాంబూలము వేసి కొనునప్పుడు ఆ యిరువురిలో నొకరికి ఆకులు నొకరికి సున్నము కావలసి ఆ గృహస్థునిపుత్రికను బిలిచి

"చూర్ణమానీయతాంతూర్ణం పూర్ణచంద్రనిభాననే"

అని సున్నము కావలసినవాఁడు చెప్పఁగా,

పర్ణాని స్వర్ణవర్ణాని కర్ణాంతాయత లోచనే

యని ఆకులు కావలసినవాఁడు చెప్పెను. ఆ బాలికయు "కవయే కాళిదాసాయ దండినే పండితాయచ" యని చెప్పుచు వాని నిచ్చెనఁట. ఇప్పటి విదుషులలో పెక్కురు పూర్వాచారము ననుసరించి విద్యనేర్చి జ్ఞానము సంపాదించినవారే. వీరంద ఱేపాఠశాలలయందుఁ జదివిరి? ఆధునిక పద్ధతుల ప్రకారము నేర్చినవారిలో పెక్కురకు జ్ఞానము తక్కువ మోహమెక్కువ. దానికి దృష్టాంతము లెన్నియో కలవు.

అనేక కారణములచేత నిప్పుడు మునుపట్టి పద్ధతులు పోయినవి. వానితో ఆ గుణములును పోయినవి. విద్యవలన లాభము ఉద్యోగమని యిప్పటి

తల్లిదండ్రుల యభిప్రాయము. అట్టి యుద్యోగము సంపాదింపఁజేయు విద్యయే పరమార్థముగ నెంచి తల్లిదండ్రులు తమ బిడ్డలకు కులవిద్య చెప్పుటయే విడిచిరి. మేము చిన్నవాండ్రుగ నుండునపుడును మా తల్లిదండ్రులు మాకు నీతి మతాచారముల గుఱించి యెన్నికథలో చెప్పుచుండిరి. ఇప్పుడు చెప్పువాఁడు లేఁడు. వినువాఁడును లేఁడు. మీరు పాఠశాలలకుపోయి చదువుచదువును గుఱించి నేను జెప్పనేల? నాలుగక్షరములువచ్చినంతనే తమకుఁ జదువు వచ్చినదని వీథియందుఁ బోవు నలువురికిఁ దెలియవలయునని యొక పుస్తకముచేతనుంచుకొని కిటికీల కెదురుగ కుర్చీలపైఁ గూర్చుండి కాళ్లు పాఱఁజాఁచి యొకకన్ను వీథిమీఁద నొక కన్ను పుస్తకము మీఁద నుంచి పెదవులు కదలించుట, విద్యావంతులమని భ్రమించి గర్వించుట, గృహకృత్యములు చేయకుండుట, పెద్దవారల నలక్ష్యభావమునఁ జూచుట, స్త్రీలు వీథులవెంటఁ బోవునపుడు చెప్పులు తొడుగు కొనవలయునా? చెడావులు తొడుగుకొన వలయునా? ముచ్చెలు వేసికొనవలయునా? మేజోళ్లు ధరింపవలయనా? యని సభలయందు చర్చించి తీర్మానించి లోకోద్ధారక కార్యము నిర్వహించినట్టు పత్రికలలోప్రకటించుట లోనైనవి యిప్పటి మీ విద్యకు పరమఫలములై యున్నవి. ఇట్టి దురవస్థ మనదేశమందే కాదు, బంగాళాదేవమందిట్టి గతియే కలిగినదని ముజుందార్ అను ఆయన వ్రాసియున్నాడు. అల్పవిద్య అనర్థకారి కదా?

ఉ. “తెలివి యొకింతలేని యెడఁ దృప్తుఁడనైకరిభం
గిసర్వముం । దెలిసితి నంచు గర్వితమతిన్ విహ
రించితిఁ దొల్లి; యిప్పుడు । జ్ఞులమతులైన పం
డితుల సన్నిధినించుక బోధశాలినై । తెలియని
వాఁడనై మెలఁగితిన్ గతమయ్యె నితాంతగగర్వమున్”

అన్నట్టు సంపూర్ణమైన విద్య వచ్చినఁ వారియం దీ దుశ్చేష్టలు గానరావు. నీతి మతాచారబోధకమైన విద్య కొంచెము నేర్చినను గర్వము గలిగింపక వినయమును శీలమును గలిగించును. మీ క్షేమము దేశకీర్తి కోరినవారైన యెడ మీ తల్లిదండ్రులును పూర్వులెట్టి యాచార వ్యవహారములచే నెట్టి ఘనకార్యములు చేయఁగలిగిరో యవి మీకు తెలిపి మిమ్ముఁ గొంతకుఁ గొంతైన చక్కఁబఱుతురు. స్త్రీలు నేర్చు విద్య యుత్తమకులస్త్రీ సమర్థములైన గుణములు ఆచారములు, నీతులు, స్వమతమును చెఱుచునవిగా నుండరాదు. ఎట్టివారి





యొద్దకు తమ పిల్లలను విద్య నేర్పుటకై పంపవచ్చును. యెట్టివారియొద్దకు పిల్లలను పంపరాదు అని పెద్దవారాలోచింపవలయును. చక్కని నడవడి లేని నీచురాలి యొద్దకు విద్య నేర్చుకొన పిల్లలను పంపిన నదితన యంతవారని జేయును. విరుద్ధమతబోధకుల యొద్దకు పంపిన మన మతమును దూషించి వారిమతమునే వారు బోధింతురు. మదనపల్లెయందొక గృహస్థు ఏడు సంవత్సరముల తన బిడ్డను సమీపమున బోధించు పాఠశాలలకు పంపుచుండెను. ఆ పిల్ల యింటికి వచ్చి అమ్మా నీ మొగాన కుంకుమేల పెట్టుకొనెదవే? బొమ్మలను చెట్లను ఏల పూజించి వానిచుట్టు తిరిగెదవే యని యేమేమో యాక్షేపించు చుండెను. తల్లిదండ్రులు బుద్ధిమంతులై యాపిల్లనుమఱియొక పాఠశాలకు పంపిరి. నోరెఱుఁగని పిల్లవాండ్రను స్వవిరుద్ధ మత బోధకుల చేతిలోఁ బెట్టి వెనుక దుఃఖించువారి కంటె మతిహీనులుందురా? చదివించుటకు రాజకీయ జాతీయ పాఠశాలలులేవా?

సహవాసమువలననే గుణములు లభించును. సహవాసమువలననే దుర్గుణములు పట్టువడును. కావున తమ పిల్లవాండ్రెట్టివారితో సహవాసము చేయుచున్నారో కని పెట్టవలసినది పెద్దవారికి విధి.

ఒక పాఠశాలకు పిల్లనలుగాని పిల్లవాండ్రను గాని పంపునపుడు అక్కడ నేర్పఁబడు విద్య నీతి మతము ఆచార మెట్టిదో పెద్దవారు తెలిసికొనవలయును. అక్కడ కూడు సంపాదించుకొను విద్య మాత్రమే నేర్పఁబడునేని తామింట జ్ఞానము కలిగించు విషయములను జాతీయపద్ధతులను నేర్పవలయును. అచ్చట విరుద్ధమతములు బోధింపఁ బడునేని యచటికి బాలురని బాలికలను బంపకుండుట శ్రేయస్కరము. విధిలేక పంపవలసివచ్చెనా యింట మన మత విషయములు వారికి నెక్కువ శ్రద్ధతోఁ దెలుపుచుండ వలయును. మన బాలురకు బాలికలకు మన నీతి మతాచారములు చక్కఁగ తెలిసియుడెనేనిదానికి భిన్నముగ నెవరైన దుర్మతముల బోధించినను వారుతెలియక చెప్పుచున్నారని వారి మాటల లక్ష్యపెట్టకుందురు. రాజకీయ జాతీయ పాఠశాలలయందు నీతి బోధింపఁబడును గనుక బాలురు చెడరు.

సంసార శకటమునకు భార్యాభర్తలు చక్రవృషభములు. వృషభము భర్త. చక్రము భార్య. వృషభము తాను చక్కఁగ బండి లాగుటకు కావలసిన శక్తియు నడవడియు సంపాదించుకొనవలయును. చక్రము వృషభమునకు తోడుపడునదియై దానికి భారము తోఁపకుండు నట్లు సులభముగ బండి

కదలునట్లు తిరుగుచుండవలెను. అటులే భార్యాభర్తలును. అటుగాక యెద్దును గట్టవలసినచోట చక్రమునుంచి, చక్రము మాఱు ఎద్దునుంచిన బండి యెట్లగునో చూడుఁడు. అటుగాక యెద్దును చక్రమును ఒక కార్యముననే యుంచిన నప్పుడెట్లుండునో చూడుఁడు. బాలలకు ముఖ్యముగ ఇల్లు దిద్దుకొను తెలివియు పరలోకమున కుపయోగపడు జ్ఞానము కలుగఁ జేయవలసినది పెద్దవారికి విధి. ఇప్పటి కొందఱు బాలికలకు ఈ రెండు సర్వమంగళము. ఏల యందురా బడులకు పోయి చదువుట వలన నింట వంటపని చేయ నేర్చుకొను విరామము లేదు. బడులలో చదువుచదువా గాడిదెకు నాలుగుకాళ్ళు. కుక్కతోఁక వెనుక ప్రక్క నుండును. "ఏనుఁగు భూమికి ఆఱడుగుల యెత్తుననుండును" అనునట్టిదై యుడును. ఇఁక గృహకృత్యములు పాటపద్యములు ఆచారములు లోనైనవి నేర్చుకొనుటెక్కడ? జ్ఞానము సంపాదించుటెక్కడ? ఎన్నివిద్యలైన నేరువవచ్చునుగాని స్వకులజాతి విద్య వేదాధ్యయనము జపము దీనియందుఁ జేరుచున్నవి.

చెడుకోరికలు, కోపము లోనైనవి లేక మనస్సు నిర్మలముగ నుంచుకొనుట, ఇతరుల మేలుగోరుట, మితముగ భాషించుట. ధ్యానము చేయఁదగిన విషయమందు మనస్సును నిలుపుట, ఆత్మకంటె నితరములైన విషయములందు మనస్సు పోనీకుండుట మానసతపస్సు అనఁబడును.

ఈ మూఁడు తపస్సులు ఒకరిని మోసగించుటకుఁగాని ఇతరులు తన్ను పొగడుటకుఁగాని చేయరాదు. నేనిటు చేసిన నాకీఫలము కావలయునని కోరరాదు. ఇది భగవంతుని ఆరాధించు విధమని భక్తితో చేయవలయును. ఇట్లు చేనయువారికి యముఁడననేల భగవంతుఁడే ప్రత్యక్ష మగును.

ఇట్టి తపస్సు చేసిన వారగుటచేతనే చంద్రమతి, శకుంతల, దమయంతి, సీతాదేవి, ద్రౌపది, సావిత్రి, లోనగు స్త్రీలు ఒకరిని శపించుటకు, తమ భర్తలకు వచ్చిన ఆపదలఁ బాపుటకు, తమ భర్తల చేత తమకు కీడు చేసినవారిని చంపించుటకు శక్తిగలవారైరి.

రుక్మిణి : అప్పా! సీతాదేవి ద్రౌపది విషయములో నీవు చెప్పినది తప్పు. శ్రీరాముఁడు రావణాసురుని చంపినది సీతా మాహాత్మ్యమువలననా? పాండవులు కౌరవులను చంపినది ద్రౌపదీ మాహాత్మ్యమువలననా? కాదు గదా.





తండ్రి : కాదని నీకెవరు చెప్పిరి? రామాయణ కథ నీకు తెలిసియుండిన నీవిట్లు చెప్పవు. భూభారము నణఁపఁబుట్టిన శ్రీకృష్ణుఁడు అశ్వత్థామ వాతఁబడకుండఁ బాండవులను కాపాడుట ద్రౌపది మంగళ సూత్రమును రక్షించుటకుఁగాని యితరము కాదు అని పెద్దలందురు.

రుక్మిణి : అప్పా! నీవు చెప్పునది వింతగా నున్నది. అయిన కానీ నీవు అబద్ధము చెప్పినట్టు నేను తలఁపను. ముందు రామాయణకథ తెలిపి తరువాత భారత కథ తెలుపుము.

తండ్రి : అవి ఒక్కొక్క నాఁటికి ముగియు కథలు గావు. మూఁడేసి దినములే పట్టునో, నాలుగేసి దినములే పట్టునో.

రుక్మిణి : ఎన్ని దినములైన పట్టనీ! కట్టె కొట్టె, తెచ్చె అని చెప్పిన ప్రయోజనము మేమి? వానిలో నుండు సారమంతయు మాకు తెలియఁజెప్పవలయును.

తండ్రి : సరి. రేపటినుండి శ్రీసీతాచరిత్రము చెప్పెదను. శ్రీసీతారాముల పటమును మీరు పూలతో అలంకరించి యిక్కడ నుంచవలెను. శ్రీరాములు పుట్టినప్పుడు సీతాకళ్యాణ మప్పుడు కావలసివచ్చును. గనుక టెంకాయలు తాంబూలము గంధము పసుపు కుంకుమము వాసన వత్తులు కూడ తేవలయును.

రాముడు : అది యంతయు నాఁడుపిల్లల పని.

అమ్మణ్ణి : పోరా సాపాటురామా! మేము చేయకుండిన నీవు చేసెద వని తలఁచి యుంటిమా. నేను రుక్మిణి చేసెదములే.

